పంచతంత్రం

# మిత్రలాభం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి








అట్లేయని ఆ హరిణ
కుమారుడు- అక్కడనే
నివసించగ సాగెను -
సాంఘిక, తాత్త్విక
చర్చలు చేస్తూ- ఇష్ట
గోష్ఠి వివాదంచేస్తూ
-నలుగురు మిత్రులు
గడుపుతుండగా -
ఒకరోజున ఏం
జరిగిందంటే .






























సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.

సంపుటము 45
సంచిక 28
11-3-53

# సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

నందన ఫాల్గుణ బహుళ దశమి; బుధవారం



సోవియట్ రష్యా ప్రధానమంత్రి జనరలిస్సిమో స్టాలిన్
మార్చి 5-వ తేదీ రాత్రి 9-50 గంటలకు [మాస్కో టైమ్] మరణించాడు.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : అరుణావారి
"గుమాస్తా"లో పండరీబాయి



## రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు వానిని త్రిప్పి పంపగోరినట్లయితే, రచనలూ చిత్రాలతోపాటు అవసరమైన స్టాంపులను గాని, స్టాంపులు అంటించి చిరునామా వ్రాసిన పెద్దకవర్లనుగాని చేర్చి పంపవలసిందని మనవి. అలా పంపేవారికి మాత్రమే వారి రచనలను గాని, చిత్రాలనుగాని ప్రచురించే ముందు ప్రచురణ విషయమై తెలియ పరచగలము. మొదట స్టాంపులనుచేర్చి పంపక, తరువాత ఉత్తరాలు వ్రాసి స్టాంపులు పంపినట్లయితే, పత్రికి పంపడం కష్టమని రచయితలూ, చిత్రకారులూ గుర్తించ ప్రార్థన. ఈ సందర్భములో రచయితలు, చిత్రకారులు మాకు సహకార మివ్వగలరని ఆశిస్తున్నాము.




"సాయంకాలే వనాంతే కుసుమితసమయే
చంద్రికాయాం
త్రైలోక్యాకర్షణాంగం సురనరగణికా
మోహనాపాంగమూర్తిం
సేవ్యం శృంగారభావై ర్నవరసభరితై
ర్గోపకన్యా సహస్రై
ర్వందేహం రాసకేళీరత మతిసుభగం
వశ్య గోపాలకృష్ణమ్."

తా॥ సాయంకాలే=సాయంకాలమందు; వనాంతే=తోటయందు; కుసుమితసమయే=పుష్పములు పుష్పించేకాలమందు; సైకతే=ఇసుకతిన్నెయందు; చంద్రికాయాం=వెన్నెలయందు; త్రైలోక్యాకర్షణాంగం=మూడులోకములను వశీకరణము చేయగల (ఆకర్షించగల) అవయవ స్వరూపము గలవాడును; సురనరగణికా మోహనాపాంగ మూర్తిం=దేవతలయొక్కయు, మనుష్యులయొక్కయు వేశ్యలకు మోహమును పుట్టించునటువంటి ఓరచూపుగల ఆకారుండును; నవరసభరితైః=తొమ్మిది విధములైన రసభావములతో నిండిన; గోపకన్యా సహస్రైః=వేలకొలది గోపకన్యకలచేత; శృంగారభావైః=శృంగార భావములతోడ; సేవ్యం=సేవింపదగినవాడును; రాసకేళీరతం=రాసక్రీడయందు ఆసక్తుడైనవాడును; అతి సుభగం=మిక్కిలి సౌందర్యముగలవాడును; వశ్య గోపాలకృష్ణం=అందరికిని వశ్యుడైన గోపాలకృష్ణుని; అహం=నేను; వందే=నమస్కరించుచున్నాను.

పుష్పించే కాలమందు (అనగా వసంత ఋతువునందు) తోటలో సాయంకాలమందు వెన్నెల గాయుచుండగా ఇసుకతిన్నెలమీద దేవతా వేశ్యలకును మానవవేశ్యలకును మోహమును పుట్టించగల ఓరచూపులుగల ఆకర్షణీయమూర్తియైనట్టియు, నవరసభరితమైన శృంగారభావమును ప్రకటించెడి వేలకొలది గోపికలచేత సేవింపబడువాడును, రాసక్రీడయందు ఆసక్తి కలవాడును అధిక సుందరరూపుడును సర్వజన వశ్యుడైనట్టియు గోపాలకృష్ణునకు నేను నమస్కరించెదను.

అటువంటి శృంగారమూర్తియైన పరమపురుషునకు అనగా గోపాలకృష్ణమూర్తికి నమస్కరిస్తాను అని చెప్పడంలో తాను ఉపాసనచేసేటటువంటి దైవమునందు శృంగారరసము మూర్తీభవించి యున్నదనే భావం స్పష్టంగా స్ఫురిస్తోంది: భక్తుడు ఏరసమును, ఏ భావమును ఉత్కృష్టమైన రసంగానూ, భావంగాను ఆరాధిస్తున్నాడో ఆ శ్లోకంలో స్పష్టమౌతోంది. ఇంగ్లీషులో ఒక సామెత ఉంది. "నీవెంట తిరిగేటటువంటి ఆప్తమిత్రులు ఎవరో ఎటువంటివారో నాకు వివరించి చెప్పితే, నీవు ఎట్లాంటివాడవో నేను చెప్తాను" అని ఆ సామెత యొక్క తాత్పర్యమై ఉంది. "నీస్నేహితులను నీవు వివరించు నిన్ను నేను వివరిస్తాను" అని ఆ ఇంగ్లీషు సామెతను తర్జుమా చేయవచ్చు. అదే విధంగా నీవు ఆరాధించేది ఎవరినో వర్ణించిచెప్పితే, నీహృదయం నేను శోధిస్తాను అని మరొక సామెతను అదే ఫణితిగా తయారు చేయవచ్చు.

అయితే భగవంతుని ఆరాధన విషయంలో మాత్రము ఒక పెద్ద పేచీవస్తుంది. భగవంతుణ్ని ఏరూపంలో ఆరాధించినా చలామణీ అవుతుంది. ఎందు చేతనంటే, అమ్మవారిరూపంలోనూ ఆరాధించవచ్చు. స్వామివారి రూపంలోనూ ఆరాధించవచ్చు. బాలకమూర్తిగా పూజించినా, లోకపితగా పూజించినా, ఆరాధనయొక్క పరమార్థం పోదు. జగత్తుకుఅంతటికీ సాధుడుగా భావించి జగన్నాథుణ్ని ఆరాధించవచ్చు. త్యాగరాజులవారు ఒక కీర్తనలో శ్రీరామమూర్తిని సంబోధించి గానము చేస్తూ, "నను పాలింప నడచివచ్చితివో నా ప్రాణనాథ!" అని మోహనరాగంలో ముద్దులు

మూటగట్టినట్లుగా ఆలాపన చేశారు. శ్రీరామమూర్తి తన ప్రాణనాధుడని చెప్పుకొన్నారు. అయితే, త్యాగరాజుగారు సీతా అమ్మవారివలెనే, ఆ శ్రీరామచంద్రునకు భార్యవత్తుగా ప్రవర్తించారని ఎంచుకోవాలి. అయితే సీతాఅమ్మవారికి పోటీగా ఆమె సవతివలె స్వామివారికి త్యాగయ్యగారు తయారైనారని మనము తప్పు పట్టడానికి తయారుకాము. ఎందుచేతనంటే, భక్తి పారవశ్యంలో ఉన్న భక్తుడు భగవంతుని పాదపూజ చేస్తాడు. సంపూర్ణ శరణాగతుడై సహధర్మచారిణివలె ప్రవర్తిస్తాడు. స్త్రీధర్మంలోకి స్త్రీతత్వంలోకి దిగుతాడు. పాలముంచినా నీటముంచినా నీదే భారమని భార్యవలె, అర్ధాంగివలె, సిద్ధమవుతాడు. భగవంతునియందున్న భక్తి ప్రతిపత్తి పతిభక్తికంటె పదిరెట్లు ఎక్కువైనది. భగవంతుడు ఆరగించిన తర్వాతనే తను ఆరగిస్తాడు. అంతే కాదు. ఒక పర్యాయము రామకృష్ణ పరమహంస పూర్తిగా స్త్రీవేషము వేసికొని తన్మయుడైనాడు. ఈవిధంగా భక్తి అనేది కేవలం స్త్రీ ప్రవృత్తిగానే భక్తుల ఆరాధనవిధానంలో ప్రత్యక్షమవుతూవుంది.

అందువల్ల భగవంతుడు సర్వజన వశీకరుడని చెప్పడంలో అతిశయోక్తిగాని అసహజోక్తిగాని ఏమీ లేదు. "సర్వశక్తి స్వరూపుడు భగవంతుడు" అని అంగీకరించిన పిమ్మట మానవుడు అనేవాడు ఆ భగవంతుని ముందర అల్పశక్తి స్వరూపుడై తీరాలి. కాని ఈ అనంతశక్తిసంపన్నుడైన భగవంతుడు తన శక్తీ తన బలమూ మనుష్యుల మీద చూపించి, మనుష్యులను చావగొట్టి చితుకకొట్టి హింసించి సంహరించి చీల్చి చెండాడుతాడా? లేక, యీ అల్ప ప్రాణులనందరినీ యీ మహాశక్తి సంపన్నుడు తన బలంచేత కాపాడి రక్షించి, సుభిక్షంగా సుఖంగా వర్ధిల్లుతూ బ్రహ్మానందంతో తేలియాడుతూ ఉండేటట్లుగా చేస్తాడా?

అక్కడేవుంది మతభేదం - అక్కడే వుంది తత్వభేదం - అక్కడే వుంది దృష్టిభేదం - ఒక్క ఉదాహరణ చూడవచ్చు - కొబ్బరిచిప్ప అనేది ఉబ్బెత్తుగా ఉంటుందా? గుంటగా ఉంటుందా? గుట్టలాగున ఉంటుందా? గుహలాగున ఉంటుందా? ఒకవైపుకు త్రిప్పిచూస్తే పల్లంగా, గొయ్యివలె ఉంటుంది. దానినే తిరగవేసి త్రిప్పిచూస్తే మిట్టగా ఉంటుంది. ఒకవైపు గోళం - రెండోవైపు బిలం - గార్డులాంతరు దీపం తెల్లగా ఉంటుందా? ఆకుపచ్చగా ఉంటుందా? ఎర్రగా ఉంటుందా? ఒక అద్దంలో అది తెల్లని దీపంగా ఉంటుంది. దానికే ఆకుపచ్చ అద్దం మారిస్తే ఈగార్డు దీపమే ఆకుపచ్చగా ఉంటుంది. దానికే ఎర్రని అద్దం ఎదురుగావచ్చేటట్లు మీటనొక్కితే, ఆ గార్డుదీపమే ఎర్రగా ప్రకాశిస్తుంది. ఎర్రగా దీపం కన్పించినప్పుడు "అపాయకరము" అనే అర్థం స్ఫురిస్తుంది. ఆకుపచ్చ దీపం కన్పించినప్పుడు "నిరపాయకరము"- "సర్వం సఖ్యం" (*All clear*) అనేభావం స్ఫురిస్తుంది.

అదేవిధంగా భగవంతుడు శృంగారమూర్తియా? రౌద్రమూర్తియా? అని ప్రశ్నిస్తే చెప్పగల్గిన సమాధానం కూడా అంతే. భగవంతుని నిజతత్వం మనకు ఎట్లా తెలుస్తుంది? మనకంటికి కన్పించే జగత్తును పరిశీలించి, పరికించి, తలపంకించి, యోచిస్తే గోచరిస్తుంది, కొంతవరకు. జగత్తును పరిశీలిస్తే జగన్నాధుడెటువంటివాడో పరిశోధించవచ్చు నన్నాడు.

ఏడ్చేవాడికి "యీలోకమంతా నన్ను ఏడిపిస్తోంది" అనే నమ్మకం కలుగుతోంది. భగవంతుడే యీవిధంగా ఏడిపిస్తున్నాడని సిద్ధాంతీకరిస్తాడు. చెట్లనుంచి మంచు నీటి బిందువులు కిందకు రాలుతూవుంటే చెట్లు కూడా ఏడుస్తున్నా యన్నట్లుగా భావిస్తాడు. ఇది పాడుప్రపంచం అని తిట్టి, "ధర్మం అనేది ఎక్కడైనా ఉన్నదా?" అని ప్రశ్నిస్తాడు. "కలడు కలం డనెడు వాడు కలడో లేడో" అని కూడా సంశయిస్తాడు. తనకు సంశయం కలిగిందంటే, భగవంతుడే మిథ్య అంటాడు. కాని, తమకు కనుపడకపోయినంత మాత్రంచేత గోపికలు వెంటనే "గోవిందుడు గోవిందా!" అని కేకలు వేయలేదు. "మల్లియలార మీపొదల చాటున లేడుగదమ్మ చెప్పరే"–అతని మల్లె చెట్ల చాటున కూడా వెతికి చూశారు. భ్రమరగీతలు పాడి పరవశులైనారు.

యమునానదీ తీరమందున్న బృందావనమనే రమ్యమైన శృంగారవనప్రదేశములో నిశ్చలుడైన శ్రీకృష్ణభక్తుడు వెతికి చూస్తే ప్రత్యక్షం కావచ్చు ఆ పరమాత్మ తేజస్సు - "సుజలాం సుఫలాం మలయజ శీతలాం, సస్యశ్యామలాం-శుభ్రజ్యోత్స్న పులకితయామినీం - వందే మాతరం" అని బంకించంద్ర చటర్జీ తన మాతృదేశమైన భారతమాతను కీర్తించాడు. భారతమాత ఆ రససిద్ధునకు ఆ రూపంలో కన్పించింది. "కాటుకకంటి నీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో కైటభదైత్య మర్దనుని గాదిలి కోడల! యోమదంబ! యో హాటక గర్భురాణి!" అని వ్రాసిన బమ్మెర పోతనామాత్యునకు సరస్వతీదేవి కంట తడిపెట్టి ఏడ్చుచున్నట్లుగా కన్పించింది. ఆమెను

> ఒకసారి వరదలు వచ్చి ఆ వూళ్లో కొన్ని యిళ్లు కొట్టుకు పోయాయి. అలా యిళ్లుపోయిన ఒక కుటుంబం వారు వారి ఏడేళ్ల కుర్రాణ్ణి, మళ్లీ యిల్లూ అదీ సరిచూసుకొనేదాక, అట్టే పెట్టుకోమని కోరుతూ, వాడి మేనత్తల వూరికి పంపించారు.
>
> కుర్రాడు వెళ్లిన మూడో రోజునే ఆ మేనత్తల వూరి నుంచీ వీరికొక వుత్తరం వచ్చింది. అందులో యిలా వుంది.
>
> "ఆ వరదనే యిటు పంపించి మీ కుర్రాణ్ణే మీరు తీసుకుపోతే మేము చాలా సంతోషిస్తాము."

ఊరడిస్తూ అపద్యం ఆమహానీయుడు చెప్పి, తన్ను తానే ఊరడించుకొన్నాడు.

అయితే మన హృదయావేదన యావత్తూ జగత్తులో కూడా ప్రతిఫలిస్తున్నదని భావించడం కేవలం రసభ్రమ. తానెంతో జగత్తు అంత – ఆత్మవత్ సర్వభూతాని అనే విషయం పెద్ద వేదాంత విషయం కాదు. అది సహజంగా ఉన్న మనుష్యస్వభావమే. కాని ఆవిధంగా ప్రవర్తించడం, భావించడం అజ్ఞానం అని కూడా వాదించవలసి వస్తుంది. బాగా చదువుకొన్న పండితుడే ఒక మంచి అమాయిక బ్రాహ్మణుడు వుండేవాడు. ఆయన యింటికి ఎప్పుడూ బంధువులు, అతిథులు, అభ్యాగతులు వస్తూవుండేవారు. తనకుగల శక్తికొద్దీ వారికి భోజన సత్కారములు చేసి తన బంధు ప్రీతిన్నీ, ఆదరణాభిమానాలున్నూ చూపిస్తూ ఉండేవాడు. ఈ గృహస్థుకు యీమధ్యకాలములో శరీరమందు జబ్బు ప్రవేశించి మలబద్ధకము అజీర్ణమువగైరా అవలక్షణములు ఏర్పడ్డాయి. అందువల్ల, ఆయుర్వేద వైద్యుని సలహాప్రకారముగా, వేపపూవు వేయించి అన్నములో కలుపుకొని తినడం ప్రారంభించాడు. ధనియములు, జీలకర్ర, వాము వేయించి, కరివేపాకుతో బాగా కలిపి చూర్ణం

సినిమా తారకి జబ్బు చేసింది. డాక్టరు వచ్చాడు. వైద్యపరీక్షకు అవసరమైన అన్ని ప్రశ్నలూ వేస్తూ, ఆ డాక్టరుగారు "మీ వయస్సెంత?" అని అడిగాడు, ఆవిడను.

ఆవిడ చెప్పటానికి సంకోచించి కొన్ని నిముషాలపాటు నిశ్శబ్దంగా వుండి పోయింది. డాక్టరుకి చిరాకు వేసింది "త్వరగా చెప్పెయ్యండి. క్షణం గడిచిన కొద్దీ వయస్సు పెరిగి పోతున్నది." అన్నాడు.

"ఐతే నలభై" అనేసింది ఆవిడ!

# ★ కాలక్షేపం ★

చేయించి ధనియాది చూర్ణమును కూడా అన్నములో వేసికొని తినుట ప్రారంభించాడు. వేపపూవు తగుమాత్రం వేసి కాచినటువంటి చారుకూడా అన్నములో కలుపుకొని తినుచున్నాడు. ఈవిధమైన పదార్థములతో అనుపానములతో అన్నము తినుచుండుటవల్ల అగ్నిమాంద్యం పోయి కరకరమని ఆకలి అవుతోంది. అన్నహితము కలిగింది. మలబద్ధకముకూడా పోయింది. అందవల్ల అటువంటి అమృతతుల్యమైన పదార్థములను తాను ఒక్కడే భుజించడం ఆయన తత్వం కాదు. తనకువేది, ఆరోగ్యప్రదమైనదో, సౌఖ్యదమై శ్రేయస్కరంగా ఉన్నదో అట్టదానిని పరమ రహస్యంగా దాచియుంచి తానే అనుభవించడం ఆయన మతం కాదు, అందువల్ల తన పంక్తిలో భోజనమునకు వచ్చి కూర్చుండిన బంధువులకు అతిథులకు అందరికీ, అత్యంతాదరణతో వారి అందరిమేలు కోరినవాడై ధనియాది చూర్ణం, వేయించిన వేపపూవు వడ్డించవలసినదనిన్నీ, ప్రత్యేకంగా ఆ పదార్థములతో భోజనము పెట్టవలసినదనిన్నీ తన భార్యతో చెప్పి, అతిథులనందరిని ఆ పదార్థములతోనే ఆరగించి ఆయురారోగ్యములను పొంది సుఖించవలసినదని హెచ్చరించేవాడు. ఆ పదార్థములు చాలా మంచివే కావచ్చు. కాని తన శరీరతత్వం ఏ స్థితిలో ఉన్నదో, తన పంక్తిలో కూర్చుండి తన యింటికివచ్చి భోజనముచేసెడి బంధుమిత్రులందరి శరీరతత్వమున్నూ అదే స్థితిలో ఉన్నదని భావించడం మనకు హాస్యాస్పదంగా కన్పిస్తుంది-కాని, "ఆత్మవత్ సర్వభూతాని" అనే ధర్మోపదేశమును యీవిధంగా అన్వయించి అమలు జరుపవచ్చుననే అభిప్రాయంగల పండితులున్నారు.

ఇంటికి వచ్చినటువంటి పదిమంది బంధువుల శరీర తత్వములున్నూ పరిపరివిధాలుగా ఉంటాయి. అందువల్ల వారి వారి శరీర తత్వాలను గ్రహించి అందరికీ అన్ని విధాలుగా వంటకములు వండి వడ్డించుచున్నామా? ఆ పని కూడా మనము పరిపాటిగా చెయ్యడం లేదు. విందు భోజనములు జరిగినప్పుడు, బాగా పుష్టిగా తిని జీర్ణం చేసుకో గలిగినవానికిన్నీ, భోజనసామర్థ్యం బాగా ఉన్నటువంటివానికిన్నీ ఏ విధమైన పక్వాన్నములు, పప్పు దినుసులు, పిండివంటలు ఉంటే భోజనము రసపుష్టిగా చెక్కపూటుగా కడుపునిండుగా ఉంటుందో ఊహించి ఆవిధమైన పంచభక్ష్య పరమాన్నములతో పాకశాస్త్రప్రావీణ్యం చూపించి విందులు చేసేటటువంటి గృహస్థును మెచ్చుకుంటున్నాము.

రసప్రపంచంలో ఎప్పుడూ అంతే-ఈ జగత్తు అంతా రసమయం అని చెప్పక తప్పదు. ప్రచండమైన తుపానులు భూకంపము జలప్రళయములు ఘోరమైన యుద్ధాలు, జనసంక్షోభములు జరుగుతూ ఉండగా వాటిని చూచినప్పుడు భగవంతుడు లయకారుడంటాము. బ్రహ్మాండమైన భీభత్సరసం యీ మహావిలయంలో కన్పిస్తుంది. కాని వసంతఋతువులో మామిడి చెట్లు చిగిరించి, మల్లెతీగలు పుష్పించి, కోయిల కూయని కూయుచుండగా రమ్యమైన వనప్రదేశములను చూచినప్పుడు భగవంతుని సృష్టికార్యమంతా అతిమనోహరంగా ఉంటుంది. మనస్సును రంజింపజేస్తుంది. చక్కని పండు వెన్నెలలో విహరించలేక విరహవేదన పడేవాళ్లు కూడా ఉన్నారు. చంద్రుణ్ని తిట్టడంకూడా కలదు. చల్లనిగాలి వీస్తుంటే ప్రియురాలు జ్ఞాపకం వస్తుంది. ఇటువంటి మనోహరమైనటువంటి మలయమారుతం మన్మథోద్దీపనం కలుగజేసేవారికి మన్మథోద్దీపనం చేస్తుంది. కాని, ఝంఝామారుతం చండీశతాండవంగా రౌద్రరసంతో రుద్రమూర్తిగా జగత్కర్తను స్ఫురింపజేస్తుంది.

కాని, నిజతత్వం బాగా ఆలోచించి ఈ జగత్తు అంతా ఒక లీల అన్నారు మహాత్ములు. భగవంతునకు యీ లోకములు, యీ గోళములు అన్నీ ఆటవస్తువులవంటివే. ఈ జగత్తు యావత్తు లీలావిలాసంగా తిరుగుతోంది. లయబద్ధంగా ఆవంతయినా గతులు తప్పకుండా అనంతమైన ఆకాశంలో సూర్యుని చుట్టూ, గ్రహాలు గిరగిర తిరుగుతూ వున్నాయి. ఇదంతా చూస్తే ఒక రాసక్రీడలాగున ఉంది. సూర్యుని చుట్టూ భూమి తిరుగుతోంది. ఈ భూమికి సూర్యుడు వెలుతురు వేడిమి యిస్తున్నాడు. ఆ సూర్యుని చుట్టూ అంగారకుడు తిరుగుతున్నాడు. ఈ అంగారకునకు కూడా సూర్యుడు వెలుతురు వేడిమి యిస్తున్నాడు. అదేవిధంగా బృహస్పతి, శుక్రుడు కూడా తిరుగుతున్నాయి. వాటికి కూడా సూర్యుడు వెంట ఉన్నట్లుగా అండగా వున్నాడు. ఒక్కొక్క గోపికకు ఒక్కొక్క కృష్ణుడు వెలిసినట్లుయింది. "అంగనా మంగనా మంతరే మాధవం." అంగనకూ అంగనకూ మధ్య ఒక్కొక్క కృష్ణుడు కన్పించాడు రాసక్రీడలో.

ఈ గ్రహాలన్నీ ఆ సూర్యుని చుట్టూ ఏదో ఒక బ్యాండు స్వరానికి లయబద్ధంగా డాన్సు చేస్తున్నట్లుగా తిరిగి, రాసక్రీడ చేస్తున్నాయి. మధ్యలో సూర్యుడున్నాడు. ఈవిధంగా బ్రహ్మాండమైన జగత్తులో ఆకాశంలోని గ్రహాలు మొదలుకొని అణువులవరకు నిరంతరం పరిభ్రమిస్తున్నాయి. ప్రతి అణువులోను పరమాణువులున్నాయి. వీటినే ఆధునిక శాస్త్రవేత్తలు ఎలెక్ట్రాన్సు లంటారు. ఈపరమాణువులకూటం కూడా సూర్య కుటుంబంలోని సూర్యునిచుట్టూ గ్రహాలకూటం తిరిగినట్లుగా ప్రదక్షిణాలు చేస్తున్నాయి. ఈపరమాణువుల పరిభ్రమణ ప్రదక్షిణాలు చూస్తే ప్రతి అణువులోను లయతప్పకుండా రాసక్రీడ జరుగుతున్నట్లుగా సాక్షాత్కారమవుతుంది. జగత్తులో జరిగే మార్పులకు సృష్టి స్థితి లయం అనే మూడు పేర్లుపెట్టి మనము నామకరణాలు చేశాము. కాని, విత్తులోనుంచి మొక్క వచ్చినప్పుడు విత్తు నశించింది. అది లయం-మొక్క పుట్టింది, అది సృష్టి - ఒక విధంగా చూస్తే యీ పరిణామమే లయం - ఈపరిణామమే సృష్టి - కొబ్బరి చిప్ప గోళం

#  ప్రత్యక్ష కల్పవృక్షం 

ఈ వృక్షము పేరు దేవదారు- "దేవదారువు" అంటే "దేవ తరువు" అనగా దేవతా వృక్షము- అని-పేరు. కాని దీనియొక్క ఉపయోగము మనకు తెలిసిన దేమంటే, దేవదారుపలకలను చెక్కలను కోయించి పెట్టెలుగా చేయించడం మాత్రమే. ఇటువంటి దేవతా వృక్షము యింతకంటె మరొక విధంగా ఉపయోగించక పోవుట చూడగా "బొగ్గులకై కల్పతరువు బొడిచిన రీతిన్" ఉన్నది.

కాని, యీ దేవదారు వృక్షము యొక్క ఆకులను కూరగా వండి తినవచ్చును- చాలా రుచికరంగా ఉంటుంది- ఈకూరలో కొంకాయ [తురిమి చెక్కిన పొట్టువంటిది] కలిపి సెనగపప్పు వేసి మిరపకాయ వగైరా వేసి వండినయెడల ఆకూర ఎక్కువ రుచికరంగా ఉంటుంది. జిహ్వా రుచి భేదమును బట్టి బెల్లము కూడా వేయవచ్చును. ఇది సులభంగా జీర్ణమై, జీర్ణశక్తిని మరింత వృద్ధిచేయును - ఇతర భోజనము అనగా అన్నము లేకుండా ప్రత్యేకముగా యీ కూరను మాత్రమే కడుపునిండ భోజనముచేసి ఎన్ని సంవత్సరములైనను సుఖముగా జీవించవచ్చును. ఈ ఆకులను ఎండబెట్టి వరుగుగా [పొట్టుగా] నిల్వచేసి ఉంచుకొని, సంవత్సర మంతయు వాడుకొన వచ్చును. ఈ ఆకునే ఏకైక ఆహారముగా తిని పర్వత ప్రాంతవాసులు చాలా మంది బలముగా పుష్టిగా జీవించుచున్నారు. ఈ ఆకు గోరింట చెట్టు ఆకువలె ఉండును. ఈచెట్టు పెద్ద మ్రానుగా నేరేడు చింత చెట్లవలె లావుగా ఎత్తుగా పెరుగును. దీనిపండ్లు ఎర్రగా గురివిందగింజలవలె ఉండును- ఈ విత్తనములను తెచ్చి మన పెరటిలో కూడా ఆ వృక్షములను పెంచవచ్చును.

ఆకులనే ప్రత్యేక ఆహారముగా భుజించుట వల్ల శరీరమునకు కలిగెడి చెడుపు ఏమిన్నీ లేదు-అంతేగాక "స్త్రీల ప్రదరము" అనే వ్యాధిని అత్యద్భుతముగా నిర్మూలించగల దివ్యౌషధమిది-మద్రాసు రాజధానిలో తిరుపతి, మదనపల్లి, హైదరాబాదు రాష్ట్రములో నల్గొండ జిల్లా మొదలైన ప్రాంతముల పర్వత ప్రదేశములందు లభించగల వృక్షమిది-ఆయా అరణ్య ప్రాంతములందు పర్వత ప్రాంతములందును జీవించుచున్న వివిధ జాతులవారిని చాలామందిని శ్రీ బాలరాజ మహర్షి గారు కలిసికొని, ఆయా మూలికల ప్రభావములను పరిశోధించి యీ విషయములను వివరించుచున్నారు ఆ నాగరికులైన కొండజాతులవారికి అత్యంత పరిచితములై నాగరిక లోకమునకు అజ్ఞాతములైన అమూల్య మూలికా పరిశోధనలు బాలరాజ మహర్షి గారు ఇంకను అనేకము చేయుచున్నారు.

---

గానూ, నల్లగానూ ఉంది. గార్డు దీపం ఆకుపచ్చగానూ, ఎర్రగానూ ఉంది. ఇప్పుడు మరణించినదానికి మరొక జన్మకలుగుతోంది అని నట్లయితే, మరణమే జననం - జననమే మరణం. భగవంతుని ప్రకృతి పరిణామ ప్రభావం భూకంపంలో ఎంత చిత్రంగా వున్నదో, పువ్వువికాసంలోకూడా అంత చిత్రంగానే వుంది. భూకంపం మనం చూచి భరించలేకపోయినామనే కారణం చేతఅది ఒక విచిత్రమైన మనోహరమైన ప్రకృతిపరిణామంకాదని చెప్పగలమా? త్రాచుపామును చూచి మనము (మరణభీతి చేత) భయపడకుండా చూడగల మనస్థైర్యము యోగసాధకమువల్ల సంపాదించినట్లయితే, ఆ త్రాచుపామును చూచి దాని యొక్క మనోహరాకృతిని గూర్చి ఆనందించగలం.

మరణభీతిని త్యజించినట్లయితే, మనకి జగత్తులో భీభత్సరసం అనేది కన్పించనే కన్పించదు. అంతా శృంగారమయా మవుతుంది. ఒక్క పిరికి చినా, అండపిండ బ్రహ్మాండములన్నియు గతులు తప్పక లయబద్ధంగా వేణుగోపాలుని మధుర నినాదములకు మనోహరమైన రాసక్రీడలు చేయుచున్నవనే ప్రకృతి పరమార్థమును గ్రహించిన పరమయోగి "సాయంకాలసమయే, చంద్రికాయాం కుసుమిత సమయే, సైకతే", బ్రహ్మానంద రసానుభవం పొందుతాడు. భగవంతుడంటే సర్వలోక వశీకరుడైన "శృంగారం రంగశేఖరావు" అని వర్ణిస్తాడు. అని హరిస్తాడు. ఇదంతా ఇంత కర్ణామృతంగా వర్ణించగల "పరయోగి విరాగి యెవ్వరు?" అటువంటి లీలాశుకయోగికే సై!



# అమావాస్య - పున్నమి




## 1

భూమి బీటలు వారి పోయింది.

అయ్యప్పగారి పెద్దయ్యా, మంచెల కన్నయ్య వచ్చి, పేడమట్టి అరుగు మీద చతికిలబడి కూచొన్నారు. మామూలుగా, కన్నయ్యను చూడగానే బొడ్లోకి చెయ్యి పోనిచ్చి పొగాకుకాడ తీసి యిచ్చే, జానికి రామన్న గూడా అటు తిరిగి, ఎండి బెట్టలు జేలిన చెఱువువంక చూస్తున్నాడు. భూమి బీటలువారింది. భూదేవి కోపం, దాగి దాగి, ఈనాటికి ప్రళయ సమయంలో పొంగినట్లుగా - బీటలనుండి అగ్గిగాలి లేచి అరుగుమీది వయసు మళ్లిన మనుషులకు తగులుతున్నది. సాయంత్రమయింది. తుమ్మల్లో ఎఱ్ఱగా కాలుతున్నాడు సూర్యుడు. ఆకాశం మీద గూళ్ళకు చేరే పిట్టల్లేవు. చివరకు తుమ్మల ఆకులైనా పచ్చగా లేవు.

కన్నయ్య తనకు దగ్గరగా వున్న ముసలి పెద్దయ్యకు చుట్ట అందించాడు. పెద్దయ్య చూడకుండానే అందుకొన్నాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. చెరువులో తవ్విన ఒర భావినీళ్ళకోసం కేళ్ళ లేసుకొంటున్న జనం కట్టమీదగా మోగిసెల్లుర్లో యిళ్ళ ముఖం పట్టేరు. మళ్ళీ నిశ్శబ్దం.

ఉండి వుండి పెద్దయ్య అన్నాడు, ఎవరివంకా చూడకుండానే -"పాలిచ్చే గేదె ఎండిపోయింది."

కన్నయ్య చుట్ట కాలుస్తునేవున్నాడు. జానికిరామన్న యిటు తిరగలేదు. పెద్దయ్య ఆరిపోయిన చుట్ట వెలిగించటానికి నిప్పురాయి కొట్టాడు.

జానికిరామన్న మాట్లాడకుండానే, తూర్పుగా తిరిగి ఆకాశంవంక చూసి, మళ్లీ ఆ కళ్ళనే కన్నయ్యవంకకు పరిచాడు. కన్నయ్యకు ఏమీ తోచనట్లుగా చిరిగిన వుత్తరీయం ఎడమ భుజాన్నుండి కుడిభుజం మీదికి విసిరివేసుకొని - 'ఇంకెక్కడి వానల్లే' - అని తనలో తానుగా గొణుక్కొన్నాడు. ఆ మాటలు మిగతాయిద్దరూ విన్నారో లేదో.

మళ్లీ కొంచెంసేపుగా నిశ్శబ్దం. తుమ్మల్లో సూర్యుడు మాయమైపోయాడు. అగ్గిగాలి ఆగలేదు.

"ఈ ఏటికి మొక్కజొన్నా అంతేలే."

పెద్దయ్య మాటలు వినకుండానే ఆ యిద్దరూ ఆకాశంవంక చూస్తున్నారు. భయంతో, సిగ్గుతో నక్షత్రాలు తొంగి చూస్తున్నవి. ముసలి పెద్దయ్య అరుగుమీది నుంచి లేచి "జానికిరామన్నా! యింటికి కంపగొట్టి మేమంతా కడప బోతున్నాం.. కాస్తంత కనిపెట్టుండు" అని అంటూనే నడక సాగించాడు. పెద్దయ్య నడుస్తుంటే గాలికి కదిలినట్లు ముగ్గుబుట్టల కదులుతున్నది. చెప్పులు తెగి, క్రింతా పోయి, మొండి ఆకారం పడ్డవి.

ఇద్దరూ పెదయ్యవంక హఠాత్తుగా చూశారు. తరవాత ఒకళ్లనొకళ్లు చూసుకొన్నారు. అభాలు, శుభాలు ఏమొచ్చినా జానికిరామన్నతో తల గలపందే, ఏపనీ తల పెట్టలేని పెద్దయ్య, తరతరాలు పుట్టి మెట్టిన ప్రాచీన గ్రామాన్ని వదిలి, ఇంటికి కంపగొట్టి పోతున్నాడా? ఆ మాటల్లోని అద్దంలో ప్రతిబింబంగా కఠినమైన సత్యం, ఎండి గడ్డి మొలక గూడా లేని చెఱువంతటి దుఃఖం - నమ్మలేక కన్నయ్య జానికిరామన్న వంక మరోసారి చూశాడు.

అవును, రాయలసీమ బీటలు వారింది.

నిశ్శబ్దం. గుంపులు గుంపులుగా ఆకాశంలో ఒంటరి చుక్కలు కూడుతున్నవి. అరుగుమీద కన్నయ్య కదిలాడు.

"అనంతయ్య ఎల్లగిత్తనీ, పుల్లెద్దునీ కడప సాయిబులికి తోలాట్ట."

జానికిరామన్న ఆ మాటకు గూడా సమాధానం చెప్పలేదు. జవాబు లేని ప్రశ్నలకు సమాధానం ఏమిటన్నట్లుగా వూరుకొన్నాడు. కన్నయ్య చుట్ట పారేసి తల గోక్కొన్నాడు. జవాబు రాలేదు జానికి రామన్న నుండి.

మళ్ళీ కన్నయ్య కదిల్లాడు. పేడమట్టి అరుగు మొగదలరాయి కదిలి, వూడి కింద బడింది.

"రాము లేడే జానికయ్యాన్నా?" ఈ ప్రశ్నకు కామాలు జానికిరామన్న యిటు తిరిగి చూసింది. చీకట్లో కన్నయ్య ఆ కళ్లను చూడలేదు.

"ఆఁ...ఆఁ.....రాములా? మాదిగపల్లె పోయాడు."

"ఏం?"

కొంచెం ఆగి—"చూడావు పొద్దువచ్చింది."

"బసవమ్మ?!"

"చచ్చిపోయింది."

కన్నయ్య చీకట్లో తలగోక్కున్నాడు. "అవును... మేత లేక..." అన్నాడు గద్గదికంగా.

బాగా చీకటి కమ్మింది. జానికిరామన్న తనకు తానుగా అన్నాడు. "మన చీని తోటలో బావి గూడా ఎండినట్టేరా, కన్నయ్యా"

ఈ మాటు కన్నయ్య మాట్లాడ లేదు. మాట్లాడక అరుగుమీదినుంచిలేవబోయాడు. మళ్ళీ మట్టిపెళ్ళలు రాలి, రాళ్ళు జారి పోయినవి.

అవును, భూమి బీటలు వారింది. వసంత కాలంలో రాయలసీమ నవ్వి చిగిర్చలేదు. చిగిర్చక ఆకసం వైపు నిస్సహాయతతో చూసింది. చేతులు ముడిచి ప్రార్థనలు చేసింది. మొక్కజొన్న పండలేదు. పాడి గేదెలు తన్నినవి. చూడి ఆవులు చచ్చిపోయినాయి. జానికిరామన్న సెంచయ్య యింటి కాడ నిలిచి, ఆకాశంవంక చూశాడు. సెంచయ్య బయటకు వచ్చి ముఖం చూశాడు. పెద్దయ్యా, కన్నయ్యా జానికిరామన్న అరుగుమీద చతికిలబడి వెళ్లిపోయారు. పూజారి నంబి క్షేమాచార్లు మంటపంమీదకూచొని, గుళ్ళో ఆరిపోతున్న దీపం వంక చూశాడు. అగ్రహారంనుంచి వచ్చిన శాస్త్రుర్లుగారు- "అమ్మాయి పెళ్ళి ఈ యేటికి గూడా లేదా?" అన్నాడు. మాలపల్లెలో కుక్కలు చచ్చి గబ్బువాసన లేచింది.

పొనకాలు తూర్పున పైగా చూ

# ★ అమావాశ్య పున్నమి ★

"అదేమిటంటావే...ఆ ఆ నలుపూ? మబ్బులేనంటావా పరంధ్రాయుడూ? పైరు గాలి దిరిగింది, మరి పరమాత్ముడి దయ" అనుకుంటూనే వెళ్లిపోయాడు. మనుషులు మాట్లాడుకొంటున్నారు. కాని ఒకళ్లముఖాలు వేరొకళ్ళు చూచుకునే ధైర్యంతో గాదు.

అవును భూమి బీటలు వారింది. ప్రకృతి శాపంవలె రాయలసీమ బీళ్ళుదేలింది. రాయలేలిన రత్నాల సీమ, చీనితోటల నల్లభూమి, బంగారుగడ్డ, మాసీమ. ఆకలితో లోకం వంక చూసింది, ఆకాశపు కోపం భరించలేక.

## 2

జానికిరామన్న ఎదురుచూశాడు - ధూమురాత్రి దాకా. రాములు తిరిగి రాలేదు.

"అమ్మా, మాలచ్మీ! బావ జాడ నీకేమైనా దెలుసా?" అని కూతురు నడిగాడు.

"మాదిగపల్లె బోతానన్నే" అన్నది మాలచ్మి. మసిబారిన పాతలాంతరు చేబట్టి జానికిరామన్న వెతకబోయినాడు. మాదిగపల్లె వెళ్ళినమాట నిజమే గాని, చీనితోట చివర బసవమ్మను పూడ్చింతర్వాత, రాములు జాడ వాళ్ళెవరూ యెరుకలేదన్నారు.

జానికిరామన్న యేడ్చుకుంటూ చీని తోటకు దారి తీశాడు. చీకట్లో బావురుమంటూ తోట, పాడుబడి దేబిరిస్తున్న ఏతామూ, ఎండి వలిగి రాలిపోతూన్న కొత్తకంచె. "రాములూ!" రాములు పలకలేదు. దయ్యాలు ప్రతిధ్వనించినట్లు తిరిగి కేక వినవచ్చింది. ఎన్నడూ, ఎప్పుడూ, ఎందుకూ భయపడని జానికిరామన్న వెనుదిరిగి వచ్చాడు. రాములు కనబడలేదు. మాలచ్మి ఏడ్చింది. పాతలాంతరు గూడా చమురు లేక ఆరిపోయింది.

కన్నయ్య పొద్దుస్నే అరుగుమీద కూర్చొని వున్నాడు.

"రాములు రాలే" అన్నాడు లోపలినించి వచ్చిన జానికిరామన్న.

"హాఁ! ఏడకు బోయినట్టు?"

పెద్దయ్య, కొడుకు వరదరాజు, కోడలు పార్వతమ్మ, మనవలమ్మ సుబ్బమ్మ, యిద్దరు మనుమరాళ్ళు అంతా నెత్తిమీద చిన్నచిన్న మూటలు గట్టుకొని, జానికిరామన్న యింటిమీదిగా కడప బోతున్నారు. పెద్దయ్య ఆగాడు. "నీ యింటికొచ్చిన వర్నా యేం లేదు పెద్దయ్యా" అన్నాడు ముందుకువచ్చి జానికిరామన్న. పెద్దయ్య కళ్లుమూసి తిరిగి తెరిచాడు. చెమ్మదేలి ముసలికళ్లు ముందును నమ్మలేక దుఃఖిస్తున్నాయి. ముసలి పెద్దయ్య నడిచివెళ్ళాడు.

మాలచ్మి పరుగెత్తుకుంటూ వెళ్లి పార్వతమ్మ బుజాన చెయ్యివేసి - "అప్పా! మళ్లెప్పుడొచ్చేది?" అని కళ్ళల్లోకి మాసింది. పార్వతమ్మ ఆకాశం వేపు చేతులు చూపింది.

"మా బావ గనబట్టం లేదు రాత్రికాడనించీ. కడపలో జాస్తే యింటికి బంపండి పెద్దామా."

సుబ్బమ్మ పెద్దమ్మ, పార్వతమ్మ, వరదరాజులు మాలచ్మి వేపు చూశారు. తిరిగి ప్రయాణం సాగింది.

## 3

మూడు నెలలు. నాలుగు. ఆరునెల్లు. రాములు తిరిగి రాలేదు.

వానలు కురిసినట్లే కురిసి తిరిగి కోపం వహించినవి. జానికిరామన్న శ్రీశైలం దేవుడికి మొక్కుకొన్నాడు. మాలచ్మిని కన్నయ్య పెళ్లాం గ్రామదేవతకు చద్ది బెట్టమన్నది. కాని జానికిరామన్న చీని తోట దిగాలుమంటూనే వుంది. మాలపల్లెంతా కడుపు చేతబట్టుకొని కోస్తా జిల్లాలు చేరపోయింది. పట్నంనించి మిల్టరీ యింజనీర్లు వచ్చి తోటలో సుయ్యిజాచి పెదిమలు విరిచి వెళ్లిపోయారు. రాములు లేని తోట యింకేం తోట? మాలచ్మి చిక్కి సగమైపోయింది. నిద్రలో నడచినట్లుగా నడుస్తున్నది. "బువ్వ మొకం గొట్టినట్లుగా" ఒంటిపూటగూడా గంజిముట్టటం లేదు. వరదరాజులు వుత్తరం రాయించాడు. ముసలి పెద్దయ్య పేదులతో చచ్చిపొయ్యాడని. ఇంటికి గొట్టిన కంపను గురించే కలవరించాట్ట. కన్నయ్య వానల్ని నమ్మి జొన్నలు చల్లాడు - ఒంటియున్నతోనే అరకదున్ని.

అగ్రహారంనుంచి శాస్త్రులుగారు పంచాంగం చంకలో బెట్టుకొనివచ్చి "జానికయ్యా, యీ ఏడైనా పిల్లపెళ్ళి తలపెడ్తావా? యిక వరుణదేవుడికి దయ గలిగిందిలే."

జానికిరామన్న మంచం మీదినించి లేచి కింద గూర్చొని - "రా...ము...లూ?" అన్నాడు. కన్నయ్యవచ్చి శాస్త్రులుగారికి సంగతి జెప్పాడు. శాస్త్రులుగారు లేచి వెళ్తూ- "ధాతకరువూ, రొక్కలకరువూ నయం జానికయ్యా, అప్పుడు వూళ్లు పాడుబడలేదు" అన్నాడు.

రాములు ఎందుకుబోయినట్లు? ఎక్కడకు బోయినట్లు? జానికి రామన్న ప్రశ్న అడుగుదామని లేచినవాడల్లా కళ్ళనీళ్లు దిరిగి తిరిగి కూలబడ్డాడు. మాలచ్మి వచ్చి భుజంమీద వాలి వెక్కి వెక్కి యేడ్చింది. చీనితోటంతా తానేయై చిందులుతొక్కి, ఏతాం లాగి, నీళ్ళుదోవలు గట్టి, బత్తాకాయలకు సంచులుగట్టి, కొత్తమొక్కలకు ఎరువువేసి, మాలచ్మితో మల్లికార్జునిడిమీద పదాలుగట్టి పంచె ఎగదట్టి, పట్నంనుంచి బొంబాయిరేవుకు బోయే మెయిలు బండికి లగూదీసి, చీని నారింజలు పెట్లెల్లో అమ్మి...రాములు చెయ్యని పనేముంది?"

"నాకంచం తిరగబడ్డది. నా కళ్లు బోయినైరా కన్నయ్యా!" అని జానికిరామన్న ఏడ్చాడు. కరువొచ్చి పెళ్లి వాగాలు పడ్డం- ఈ యేడని, ఆ యేడని, వచ్చే ఏడని, పైవచ్చే ఏడని, రాములనేవాడు - "నా పెళ్లాం నా యింట్లోనే వుండే, కన్నయ్యబాబూ!". కన్నయ్య నవ్వి "ఆరి నీ చిగ్గొయ్య గంద్రా! ఆ మూడు ముళ్ళు బడేందీ మాలచ్మిని పెళ్ళం గిళ్ళం అనేవు గనక. తిరగ మాతగరికె గాలిందాకా మా పిల్ల అంటుకస్తది." అని భయపెట్టేవాడు. తోటకాడికొచ్చిన పళ్ళసాయిబులు వందకు పావలా ఎక్కువిస్తామన్నా, రాములు వినిపించుకోక, పెద్దగంప నెత్తినేసుకొని మెయిలు వేళకు చద్దిబువ్వ దిని పరుగులు దీసేవాడు. "మావాఁ చేస్తే రైల్లో వుద్దోగమే జెయ్యాలే" అనుకొంటూ జేబులు గలగల్లాడించుకొంటూ యిల్లు జేరేవాడు. "నువ్వు జదివిన చదువుకంట్రా" అని జానికయ్య.

"ఓస్నా. యింజేను నడిపేందుకేం సదువులా."

మాలచ్మి మామ అల్లుళ్ళవరస విని నవ్వుకొనేది. అమ్మా నాన్న కరువైన రాములూ తల్లి లేని మాలచ్మి - నువ్వు చిలకంటే, నువ్వు చిలకని పెరిగారు.

* * *

కరువు ముదిరి, చీనితోట చింతలపాలు కాగానే రాములు కొస్లె విరిగిపోయినై. రైలుదాకా బోయి ఒట్టి కళ్ళతో బొంబాయినించి వచ్చి పోయే ప్రయాణీకుల్ని చూస్తూ, తిరిగి యింటికొచ్చి, కాళ్ళు నిలవక తోటదాకా బోయి, బావిలో తొంగి మాచి, నిస్పృహతో ఏతాం పూపి జూచి, మంటపం దగ్గర దిగులు కబుర్లు విని...ఏమిటీ జీవితం? ఈ బతుక్కి ఏమని అర్థం? తిరిగి మురిగి మిగిలిన జొన్నలు మూడు మంచాలకు దిగడినై. జానికిరామన్న

వంక రాములు ఒకటి రెండుసార్లు చూశాడు.

"కడపలో ముఠాలుకు పని దొరికిందట"

"ఏం పని?" అని తిరిగిచూశాడు జానికయ్య.

"ఫేక్టరీలో."

"నమ్మకురా"

"జొన్న లయిపోతున్నై...మామా!"

"అందుకని పుట్టినగడప వదిలిపెట్టామంటూ...రాములూ?"

"సద్దామంటావా?..."

"చచ్చేదెందుకు? ఎన్ని కరువులు సూళ్లేదురా, రాములూ? మా తాత డొక్కల కరువులో జచ్చాడు. మా అయ్య ధాత కరువులో జచ్చాడు. అందుకని నమ్మకొన్న నేలనా వదిలేది?"

"గుంటూరు బోయిన జనం వుప్పో గంజో తాగి బదకటం లేదంటే?"

"భూమి బోయింతర్వాతనంటరా బదుకు రాములూ? బలుసాకు తిని బదకటం బదకటమేనా? ఈ బదుక్కి ఏమున్నా వుంటే ఈ నేల్లో వుంది. ఈ నేలకోసం పుట్టాం. ఈ నేలను నమ్మాం. నమ్మిన వాళ్లకు నాశనం లేదు."

"మీ తాత? మీ అయ్య..."

"వాళ్లె మనుషులు."

ఆమాట తర్వాత రాములు నోరు మెదపలేదు. దిగులుగా కూచున్నాడు. ఆ పొద్దు రోట్లో మాలచ్మికి సాయిదాగా జొన్నల్లో పోటువేశాడు. బసవమ్మ మేతలేక చావగానే, మాదిగపల్లెకు బోతానని పోయాడు. పోయేటప్పుడు — మాలచ్మి, బావగడ్డం పుణికి —"కోపమా?" అంది. "ఊహూఁ" అన్నాడు పిల్లాడు. మాలచ్మి నవ్వుకొంది. రాములు నవ్వలేదు. తిరిగి కనబడనూలేదు. ఆరు నెల్లయింది.

## 4

కొండలమీద వానలుగురిసి వాగులోకి, యీ నాలుగేళ్ళకుగాను మొదటి సారిగా కొత్తనీళ్లు వచ్చినై. పాత జమ్మి, దుబ్బుగడ్డీ, ఎండు తాటివిత్తులూ, గులకరాళ్ళూ కొత్తనీళ్ళతో కొట్టుకువచ్చినై. కన్నయ్య చెరువుకు గండిగొట్టి వాగునీళ్లు నింపేందుకు పదిమందినీ పోగుజెయ్యటానికి వూళ్లోకి పోయాడు. కన్నయ్య చిన్నకొడుకు గండికొట్టే చోట చొక్కా లేకుండా నిలబడి వాగులో ఒండ్రునీళ్ళనుండి దుబ్బుగడ్డి లాగుతున్నాడు.

"ఊస్స్...రాములన్న!"

కట్టమీదికెక్కి, కొత్త పైపంచె ఏళ్లాడేసుకొని నవ్వుకుంటూ నడుస్తున్న సన్నకారు మనిషి రాములు.

కన్నయ్యకొడుకు నాగేంద్రం, చేతిలో తడి దుబ్బు వాగునీళ్ళలో పారేసి, కొత్తగా వచ్చిన బలంతో జానికి రామన్న యింటికి బరిగెత్తి, గుక్క దిప్పుకోకుండానే "వచ్చాడు మాఁవా! నిజం! సత్తెం! వచ్చాడు! నేం జూస్తే!" అని దబాయించసాగాడు.

అప్పటికి జానికిరామన్న మంచాన బడి నెలదాటిపోయింది. కొంచెం మూలిగి జానికయ్య "ఎవ్రా, నాగేంద్రం" అని అనగలిగాడు.

"ఎవరేందే? రాములన్నైతే."

మాలచ్మికి యీ మాటలు వినబడి పైట సర్దుకొంటూ పరుగుదీసింది. ఆ మాటలంటుండగానే పెద్ద అంగల్తో రాములొచ్చాడు - పెళ్ళలు విరిగిన అరుగులు జూస్తూ. మాలచ్మికి మూర్ఛ వచ్చినంతయింది. కన్నయ్య కొడుకు నాగేంద్రంకు అణా "బక్షీసు"లు దొరికినై. ఊరంతా గప్పుమంది.

* * *

శాస్తుర్లుగా రొచ్చి లగ్గం అన్నాడు. కన్నయ్యన్నట్టుగా మూడు ముళ్లు వేస్తానన్నాడు రాములు. తంతే గారెలబుట్టలో బడ్డాడు రాములు.

"అరి చిచింద్రిగా! కబురు లేకండా బోయినావ్! మీ మాఁవ జచ్చినంత పనయిందిగందా" అని కన్నయ్య సంతోషంతో కసిరాడు రాముల్ని.

"రైల్లో గేటుకాడ పనయిందే, చిన్నయ్యా"

"అనుకొంటినే అనుకొంటిన్రా! యాడా చెప్పినావు గాదు."

"పట్నంకాడ కొత్త చీమెంటు పాక్టరీ గడుతుంద్రే అడనే, గేటుకాడ."

"జీతం మాట."

"నలభై"

"నీ తిస్సాదియ్యా."

రాములికి పెళ్లయింది. మాలచ్మి మూడుముళ్ళేసుకొని రాముల్ని జూసి తొలగిపోతున్నది పిల్ల. జానికిరామయ్య - "యీ యేటిగ్గూడా చితికినట్టే. వచ్చేనాటికి" అన్నాడు మొదట్లో. "డబ్బుకు జూసెద్దే మావా" అని సంచీ చూపించాడు రాములు. "తొందర" అన్నాడు జానికయ్య. "వుద్దోగం బోద్ది" అని రాములు. రాములికి పెళ్లయింది. వాగునీరు చెరువుకు బెట్టారు. కన్నయ్య మళ్ళీ జొన్నలు జల్లాడు. భూమిమీద బీటలు మూసుకున్నై. అగ్గిగాలి చల్లారింది. రాయలసీమ గూడా నవ్వింది.

"చెలవై పోయిందె" అని రాములంటుండగానే, జానికిరామన్న, చిక్కి, ఖేదుల్తో సగమై, కళ్లలో ప్రాణం బెట్టుకొన్నవాడు- కొయ్యబారిపోయాడు. "చీనితోట... రా...ము...లూ" అంటూ ప్రాణం బోయింది. కన్నయ్య వచ్చి తలకింద దీపం బెట్టాడు.

పెద్దదినం అయిపోగానే, చీనితోటను బేరానికి బెట్టినాడు రాములు. "దమ్మిడీ రాదు. పాడుబడింది. చుద్ద దండగ" అంటూనే కోమటి సీతయ్య తోటను నాలుగో వంతుకు కట్టుకొన్నాడు. తోటనమ్మి, జానికిరామన్న దినం అయిపోగానే రాములు, పట్నం బయట కొత్త సిమెంటు పేక్టరీ దగ్గర్లో, రైలు క్రాసింగు మీద గేట్లుమూసి, లారీలను, జనాన్ని, గేదెల్ని పల్లెటూరి బళ్లనూ, రైళ్లకింద బడకుండా రక్షించను వెళ్లిపోయాడు. కొత్త మాలచ్మి వుద్యోగస్థుడి భార్యగా వూరు విడిచింది. తండ్రీ, తోటా లేని వూరు.

## 5

వంకర్లు తిరిగి తిరిగి పట్నంరోడ్డు రైలు పట్టాలకడ్డం వచ్చింది. ఆ రైలు రోడ్డు క్రాసింగు దగ్గరే రాములు గేటు. గేటుకు తూర్పుగా అరఫర్లాంగులోనే గుజరాతు మార్వారీ సేఠ్లు కట్టించిన కొత్త సిమెంటు ఫ్యాక్టరీ. రైలుపట్టాలకు పదిగజాల్లోనే రాములు-రైలుయిల్లు. కొంచెం తలెత్తితే పట్నంలో మేడలు, కోర్టులు, సినిమాలు - మాలచ్మికిగూడా కనబడేవి ఒక పక్కనుంచి, ఇంకోపక్కన మిల్లు కూలీలు గట్టుకొన్న ఎగుడుదిగుడు గుడిసెలు, పాకలు, రిక్షావాళ్ళ అద్దె పూరి కొంపలు. దూరంగా ఒక్క జువ్విచెట్టు, యింజన్నుంచి పొగబొగ్గునుసి, రోడ్డుమీది నుంచి కార్లు, లారీల దుమ్ము - మాలచ్మికి కావలసినంత చాకిరి. రాత్రిం బవలు సందడి.

రైలింట్లో కొత్తగా కాపరం బెట్టినరోజున, కొత్తకుండ పొయ్యిమీద బెట్టుండగా మాలచ్మికి, గేటుమీది గంటగణగణా వినొచ్చింది. రాములు ఆదరాబాదరాలేచి, నీలి చొక్కా తగిలించుకొని, పచ్చజెండా ఎర్రజెండా చంకలో బెట్టుకొని, ఉప్పె

(52-వ పేజీ చూడండి)

# లోకం తీరు

"ఆయినా మీకెందుకండీ ఈ శ్రమ?!—హాయిగా ఇంటిదగ్గర కూర్చోక, తగుదునమ్మా అని వయస్సు మళ్ళినా ఇలా ఇంటెడు చాకిరీ చేస్తూ, ఆఖరికి నీళ్ళుకూడా మొయ్యవలసిన కర్మం!" అందొకావిడ, బిందె తెస్తూ తెస్తూ కాలు జారి పడిపోయిన శీతమ్మను లేవనెత్తుతూ.

"మరి కర్మ కాకపోతే మరేమిటిదంతా?!—ఏనుబోతులాంటి కోడలు ఇంట్లో ఉండీకూడా ఇలా పడుతూ లేస్తూ చాకిరీ చెయ్యాలం! . అయినా మీరొట్టి అమాయకులు సుమండీ. ఈ రోజుల్లో అమాయకత్వం క్షంతవ్యం కాదు!" అంది మరొకావిడ దొర్లిపోయిన బిందె తెస్తూ.

"దెబ్బేమీ తగల్లేదు కదా!.. అయినా ఇదంతా పూర్వ జన్మకర్మ ఫలితం!—అందుకే అలాంటి కోడలు దొరికింది. నేను కాపరానికి వచ్చినప్పటినుంచీ, ఇప్పటి వరకూ ఒక్కమారయినా మా అత్తగారిని


శ్రీ ఆకుండి
నారాయణమూర్తి


కాలు కదపనివ్వలేదు. ఇంటెడు చాకిరీ నేనే చేస్తూఉంటాను." తన ప్రయోజకత్వాన్ని తెలుబడి చేసుకోనే అందుకు అదే సమయమని అందొకామె.

"ఆఁ!...నీకూ ఈ శీతమ్మగారి లాంటి అత్తగారే దొరికుంటే మహాచేసేద్దువు చాకిరీ. మన కర్మకాలి మనకు బ్రహ్మరాక్షసు లాంటి అత్తలు లభ్యమయ్యేరు. చాకిరీ చెయ్యకపోతే వీపు పెట్లగొడతారని భయపడి చేస్తున్నాము. అంతే!—ఇంతకీ శీతమ్మగారు మంచిగా ఉండడం మంచిదే కానీ, ఇంతలా అతి మంచి పనికిరాదు." అని అత్త పెట్టేబాధలు సహించే అందుకు సహనం తప్పిన ఒకావిడంది.

అప్పటికి కొంచెం తేరుకుంది శీతమ్మ. "ఎందుకమ్మా అలా ఊరికే అనేస్తున్నారు!—ఏదో కాలుజారి పడ్డాను. అంతేగా!" అంది.

"బాగుంది. దేముడి దయవల్ల ఏ పెద్ద దెబ్బాతగల్లేదు గానీ లేకపోతే, ఈ ముసలి తనంలో పడితే ఏ కాలో చెయ్యో విరిగి పోడం తప్పితే ఇంకేముంది—పోనండీ!... పోనీ ఇంట్లో పని మీరు చేస్తున్నారంటే బాగుంది. కనీసం కొళాయిదగ్గరనుంచి నీళ్ళయినా తీసుకురాలేదేమిటి మీ కోడలు? ఇంతిదేమిటండీ?" అందొకావిడ.

"చిన్నపిల్ల!—దాన్నెందుకు బాధపెట్టడం లెద్దురూ!" అంది శీతమ్మ సొట్టలు

(54-వ పేజీ చూడండి)

"లెండత్తగారూ! మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి"



# గోడ మీద బొమ్మ

శ్రీ బలివాడ కాంతా రావు (చిన్ననవల)

(గతసంచిక తరువాయి)

## 14

పోలాలమావాస్య వెళ్ళిన తొమ్మిదో రోజు వచ్చింది. రామంకు గడచిన పదిదినాలు పరీక్షాసమయంగానే పరిణమించాయి. జీవితంమీద విరక్తి కలిగి మనస్సు పరిపరివిధాలుగా పోయేది. ఇంటికి రావటం అంటే ఏదో బెంగ ఆవరించేది. ఉదయం అనగా ఆఫీసుకుపోయి సాయంత్రం యింటికి చేరుకొనేసరికి కర్ణకఠోరమైన మాటలు వినగానే హృదయం కంపించేది. ఒక దెబ్బ తినగలడుగానీ ఒక్కమాట పడటం అంటే ఎంతకష్టం! ఆ దెబ్బవలన ఎముక విరిగినా అతుక్కుంటుంది కాని మాటలవల్ల మనస్సు విరిగితే అతుక్కోవటం కష్టం.

సాయంత్రంవేళ యింటికి వెళ్లటం సాధారణంగా మానివేశాడు. ఒక్కొక్క రోజు రాత్రి ఆలస్యంగా యింటికి వెళ్ళేసరికి తన భోజనం వరండాలో చక్కామూతపెట్టి యెవరికి వారె నిద్రపోయేవారు. తను భోజనం చెయ్యకపోయినా తెల్లవారేసరికి అత్తగారి మూతి విరుపులతో కష్టపడవలసిందే!

ఇంట్లో యెవ్వరూ తనతో మాట్లాడరు. మాట్లాడబోయే బుచ్చిగాడిని దగ్గరకు చేరనివ్వరు. పెద్దవాడు ఎప్పుడో ఒకరోజు కాఫీకి పిలుస్తే పిలుస్తాడు లేదా అంటే లేదు. జానకి ప్రవర్తన ఇంత వేగిరంగా ఇలా మారటంతోనే తన హృదయం చివుక్కుమంది. తను చెల్లెలను గురించి ఆరాటపడే క్షణాల్లో భార్య దగ్గర చేరి ప్రశాంతమైన నవ్వుతో కొంత మనస్సును శాంతపరచేది. తన మంచిని ఆమె అర్థంచేసుకుంటుందని, తనంటే ఆమె కెంతో గౌరవము, ప్రేమా వున్నాయని నిర్ధారించుకున్న మనస్సును ఆమె యీ రోజుల్లోని ప్రవర్తన బలంగా గాయపరచింది.

అటు వెంకట్రావు మాటలనుబట్టి చూస్తే పార్వతి చిక్కి సగమయింది. ఆమెను చూస్తుంటే వెంకట్రావుకే జాలి కలిగిందిట. ఇటు సుందరమ్మ మాటలకు అడ్డు ఆపులేకుండాపోయింది. నీచత్వమంతా ఆమెలో మూర్తీభవించిందని ఆమెను సంస్కరించటం బ్రహ్మతరంకాదని, ఒకవేళ ఆమె నోట్లో నోరుపెడితే ఒక్క క్షణం ఆ ఇంట్లో వుండలేనని అనుకొన్నాడు. ఇరుగుపొరుగువాళ్ళతో ఇంటి విషయాలు చెప్పుకుని ఆమె సాధించుకున్నదేమో, ఆమె మూర్ఖత్వాన్ని అర్థం చేసుకోలేకపోయాడు. ఈ గుట్టు యీ నోటా ఆ నోటా పడి యెంత అప్రతిష్ట తెస్తుందో ఆమె ఆలోచించటం లేదు. ఈవిషయమే చెప్దామని చాలసార్లు ప్రయత్నించాడు. ఆమె దగ్గరగా వెళ్లటానికి తన మనస్సు జంకింది. అల్లుడు యింటిపనులేవీ చూడడని అందరితో చెప్తుంది. అంత అధికారమే తనకు నిజంగా యిస్తే తనకు కావలసిందేమిటి? సంతోషంగా బజారునుండి కూరలసంచీ మొయ్యమన్నా మోస్తాడు. ఆ పనిచేస్తామన్నా ససేమిరా వద్దంటుంది.

"అల్లుడిని కిందనుంటే చీమ, మీదనుంటే దోమ కరుస్తుందని చూడటం నాకు తెలీదమ్మా! నాపిల్లలు కన్నా నా - ఏదుంటే అది తినటం లేకపోతే పస్తుండక యేం చేస్తాం!"

ఈ మాటలనటానికి యీ యింటికి వచ్చాక తను వంటమీద, కూరలమీద యెటువంటి ఆక్షేపణ భావ్యతోనైనా చెప్పలేదు.

పురుగులు తినని బియ్యం వండేటప్పుడు కూడా సంతోషంగా తిన్నాడు. ఇలా అబద్ధాలపుట్టను సృష్టించి పదుగురిలో పరువుతీసికోవటమే అత్తగారి పనైతే తనా యింటిలోవుండి ప్రయోజనమేమని విచారించేవాడు. ఎక్కడికైనా పోదామని ఒక్కొక్కసారి అనుకునేవాడు. అధికారాన్ని ఆమె ఆశకొద్దీ దుర్వినియోగం చేస్తోంది. ఎప్పుడో ఒకనాడు ఆమెకు పరాజయం తథ్యమనే విశ్వాసంకూడా మనసులో ఒక మూల ఆశాజ్యోతిగా వెలిగేది.

ఆనాటిరాత్రి భోజనానికి వెళ్లేసరికి యింట్లో అంతా తెలివిగానే వున్నారు. సుందరమ్మ వడ్డించింది మూలుగుతూనే. ఈ మూలుగు ములుకుల్లా మనస్సుకు నాటిపోవటంవల్ల ఒక్కొక్క మెతుకు గాజుముక్కల్లా కనిపించింది. ఈ విషమపరిస్థితిని దాటాలంటే తను మావయ్య యెదురుగా నిలబడి, తన కష్టములన్నీ చెప్పుకుని, తన భాగం అడగాలి. తనెందుకు అడగకూడదు? భోజనం అయిందనిపించి చేతులు కడుగుకున్నాక మళ్లీ మనస్సు వెనుకకు లాగింది. అంత పెద్ద మనిషిని ఏమని అడుగుతాను! తన మార్పుకు ఆయన మనసులో ఎంతగా బాధపడతారో? ముసలాయన యిచ్చేవరకూ ఆగాడు కాదని, ముక్కుమీదగ్రుద్ది మరీ ఆస్తి పుచ్చుకున్నాడని యెందరో అనుకుంటుంటే విని ఎటా సహించగలడు? తన్నింతగా తయారుచేసినందుకు తనిలా ద్రోహం తలపెట్టడమా? ఆయన ఎలాను యిస్తారు. అలాటప్పుడు నోరువిప్పి అడుగగలనా?

మేడమీదకు వెళ్ళి కుర్చీమీద కూలబడ్డాడు. జానకి వచ్చి మామూలుగా వేరే మంచముపై పడుకుంది. జానకితో తన విషయమంతా చెప్దామనుకున్నాడు. "నాకు మాత్రం డబ్బుఅంటే ఆశలేదా? మామయ్య తప్పకుండా సగం ఆస్తి నాకు యిస్తారు. నాకా మాత్రం నమ్మకం వుంది. అంతవరకు ఆగటం మంచిదికదూ!" అని, కానీ తనమావయ్యగారి చిత్తశుద్ధిని శంకించిన సుందరమ్మ కామాటలు రుచించవని వూరుకున్నాడు.

అక్టోబరు పదోతేదీన పోలాలఅమావాస్య వెళ్ళిన పదోరోజది. వెంకట్రావు ఆఫీసునుంచి వస్తూంటే విడిపోయేముందు వ్యాఖ్యానించాడు. ప్రపంచం తలక్రిందులవుతోందని, స్త్రీపురుషులకున్న సంబంధ బాంధవ్యాలు కామమోహాముల దృష్టితే



గౌతమ బుద్ధుడు:

శ్రీ సి. హెచ్. సి. వెంకట్రావు, గుంటూరు.

# ★ గోడమీద బొమ్మ ★

వీక్షించి, న్యాయాన్యాయనిర్ణయం చేసుకోవటం యీ తరంవాళ్ళకు పరిపాటయిందని, దీనికి కారణం కమ్యూనిజము అనేక రూపాలతో దిగబడి ముఖ్యంగా యువకుల్ని శక్తివిహీనులుగా చేస్తోందని చెప్తూ యీ రోజుల్లో నిజాయితీగల అన్నా చెల్లెలైనా లోకంకోసం దూరదూరంగా వుండటమే మంచిదని అన్నాడు.

ఒంటరిగా నడుస్తున్న రామం విస్మయంతో వూరికే చూస్తూ నిల్చుండిపోయాడు. వ్యాకులపడుతున్న మనస్సులో పెద్దపెట్టున వింతవింత ఆలోచనలు పొర్లాడుతుంటున్నాయి. వేసుకున్న తన బట్టలే తనకు పురిత్రాడులా కనిపించాయి గబగబ యింటివేపు నడిచాడు.

బట్టలుమార్చి మెట్లు దిగుతున్నాడు. చీకటి నలుమూలలా అలముకుంటూంది. అత్తగారు ఏవగింపుతో రాల్చుతున్న మాటలతో కన్నులు మరింత చీకటిక్రమ్మి ముందుకు సాగిపోలేక నిల్చుండిపోయాడు.

కూతురుమీద విరుచుకపడ్డట్లు నటిస్తూ ఆ ముద్దముఖంలోని కోపం యీ ప్రశాంత విహీనుడైన అల్లునిమీద అస్త్రంలా ప్రయోగిస్తోంది. "సంసారం గట్టిచెయ్యటం ఎప్పుడే నేర్చుకుంటావ్? ఎవరిబాగు వారు చూసుకుంటుంటే మనయింట్లో అందరూ సన్యాసులమై కూర్చుంటే ఎలా ఔతుంది? ఈవేళ ఔనన్న పెద్దమనుష్యులే రేపు కాదంటారు. కన్నవాళ్ళు గనకనా అభిమానాలెప్పుడూ వుండిపోడానికి? రేపు కాదంటే కోర్టులెక్కుతామా? కోర్టుకెక్కినవాడు గాడిదనెక్కినవాడూ ఒక్కటే అంటారు."

గొంతుకఘాటీ అంతకంతకు హెచ్చింది. మానంతో ఎదురుకుంటున్న అల్లునిచూచి, కుపితురాలై, "వూయకున్నవాళ్లతో వూరంతా చాలరు! నా మాటలకే నాకు ఎదురుతిరిగేవారు వచ్చారు. నా కర్మ! నేరక చేసుకున్నాను!"

ఈ భారీమనిషి మాటలతో చేసిన అవమానంతో హృదయక్లేశం ద్విగుణీకృతమై కోపంగా మారిపోవొచ్చింది. "నీ కూతుర్ని నీ యింట్లోనే పెట్టుకుని పూజించు" అని నాలిక చివరవరకు వచ్చింది. కాని చప్పున గోడమీదబొమ్మ మనఃఫలకముపై మెరపుతీగలా తలపుకువచ్చింది. బలమంతా వుపయోగించి పెదాలు నొక్కిపట్టి ఉవ్వెత్తుగా వచ్చిని కోపాన్ని అణచుకుంటూ, "మనిషి-మనిషి" అని వుచ్చారణచేస్తూ తప్పుకుంటూ వెళ్ళిపోయాడు.

కోడుమీదకు వచ్చేసరికి పూర్తిగా శాంతుడై మళ్ళీ విమర్శనలోనికి దిగాడు. తన బ్రతుకంతా ఏమిటి? తనకు తల్లీ, తండ్రీ కాని, వారివంక బంధువులు కాని ఎవ్వరూ లేరు. తల్లిదండ్రులకన్న గారాబంగా పెంచిన వారియందున్న అపరిమితమైన గౌరవంతో వాళ్లను మెచ్చి కొలిచి పొందాలనుకున్న ఆనందానికి తాను నోచుకోలేదు. వాళ్లు మనస్ఫూర్తిగా చూపించిన అభిమానాన్ని కూడా తను స్వీకరించ లేదు

చల్లనిగాలికి అప్పుడే మడతవిప్పిన చాకింటి బట్టలు రెపరెపలాడుతున్నాయి. చంద్రుడు మసగ్గా వెలుగుతున్నాడు. సముద్రం హోరుమని శబ్దంచేస్తోంది. ఆ సముద్రతీరాన్ని




"రాధాకృష్ణ"

శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మ, వెల్లటూరు

## ప్రశ్న

ఈ మొగ్గ వికసించునో
ఇట్టులే నశియించునో
విరిసి మధు పాగమమ్మునో
ఛిదిలి నేలకు రాలునో.

ఈ నదమ్మిటు సాగునో
ఈ యెడారిని యాగునో
సాగి కడలిని క్రుంకునో
ఆగి కడకిట యింకునో.

ఈ మురళి రవళించునో
ఈ గాన మెడలించునో
విశ్వగీతము వినుచునో
విలయగానము వించునో.

ఈ తపసు ఫలియించునో
ఈ తపసు తేజరిలునో
ఈ తనికి సార్థకమానో
ఈ తనికి వ్యర్థమానో.

—సవ్యసాచి

## గోడమీద బొమ్మ

ఉత్తరదిశగా ఎకాఎకి నడుచుకుపోతున్నాడు.

డబ్బుకోసం అత్తగారు మానవత్వం మరిచిపోయింది. ఆమెను తలంచుకుంటుంటే భయంతోపాటు దుఃఖం పెనవేసుకవస్తోంది. విశాలాక్షి అందాన్ని అమాయకత్వాన్ని అమితంగా ప్రేమించాడు. ఆమె తల్లి యీ కల్లోలానికి మరింత కారకురాలైంది. మనిషి ఎంత సుకుమారమైనదో మనసూ అంతే! ఆ వెన్నముద్దలాంటి మనస్సులో పంచదార కలపవచ్చును, విషమైనా కలపవచ్చు! ఆమెకు ఆ తల్లికి పడవోకళ్ళ సంబంధం. ఆమె తన ముఖం చూసి సంవత్సరమైనా కాలేదు. ఆ బలమైన సంబంధాన్ని విడదీయటానికి బలమైన ముహూర్తం కావాలి.

చల్లని నీటితుంపరలు శరీరంపై పడి గిలిగింతలు పెడుతున్నాయి. మెరుగెక్కని చందమామలానే తన మనసూ వుంది. నిరాశ తనను కొండచిలువలా మ్రింగటానికి ప్రయత్నిస్తోంది. ముఖం వెలవెలబారి డొక్కలు పీకిపోతూంది. ఎక్కడలేని ఆరాటం తనను ఆవరించుకోవటం మూలాన్న యింటివద్ద సరిగా భోజనమే చేయుటలేదు. ఎదురుగా రాతుగులాని గుట్ట కనిపిస్తోంది. పైకెగసిన కెరటాలు ఆ గుట్టను ఢీకొని పెద్ద శబ్దం చేస్తున్నాయి. మనస్సు విషాదభారం కాగా, అడ్డూ అపు లేక వడివడిగా నడిచిన కాళ్లు శక్తిచాలక ఆగాయి. నిర్మానుష్యమైన ఆ ప్రదేశంలో చుట్టూ చూసి తనవైపొకసారి చూచుకున్నాడు. గాలి హోరున వీస్తూ తన చెదరిన జుత్తును ఎగురవేస్తోంది. రోడ్డుప్రక్కన మెట్టపల్లాలలో అక్కడక్కడ శ్రీమంతుల బంగళాలు మౌనంగా నిద్రపోతున్నాయి. యిల్లు వదలి మూడుమైళ్లపైగా నడిచాడు. హఠాత్తుగా తన ప్రక్కను ఎవరో నిల్చున్నట్లు భ్రమపడ్డాడు. వెంకట్రావు తనను నీడలా వెన్నాడుతున్నాడేమో, వినరాని పలుకులు వడిగా పల్కుతున్నట్లు భ్రమించి బెదురు బెదురుగా చూస్తూ చెవులు మూసుకున్నాడు.!

తన చెల్లెలు! ఈ తలంపు ఒక్కసారి కళ్లవెంట బొట బొట కన్నీరు రాల్చింది. ఆ యిసుకపై అలా కూలబడిపోయాడు. ప్రపంచమంతా శూన్యమయినదిగా, సాంఘిక జీవనానికి పనికిరానిదిగా కనిపించింది! వెంకట్రావు ఏదో కారణం మనస్సులో లేకపోతే అలా మాట్లాడుతాడా? లేనిపోని ఆలోచనలతో మనస్సులో మహా తరంగాలు వుబుకుతున్నాయి. తనకు తోబుట్టువులు లేని లోటు యీ చెల్లెలు తీర్చిందో ఆ చెల్లెల్ని చూసినంత అభిమానంగా ఎవరినీ చూడలేదు. ఒక్కరోజైనా ఆ చెల్లెల్ని చూడనిది వుండలేనివాడిప్పుడు, ఆమె పడుతున్న కష్టాలను వింటూ కూడా మనస్సు సంధానపరచుకోవటంతోనే శక్తి వినియోగిస్తున్నాడు.

నిముషనిముషానికి వ్యాకులత హెచ్చిపోతోంది. గుండె నిబ్బరం యిసుమంతైనా లేని మనిషిగా మారిపోతున్నాడు. స్వార్థం, డబ్బు, కామం, మోహం యిదే యీ ప్రపంచం! ఈలోకంలో బ్రతికి నే నెవరిని వుద్ధరించాలి?

అప్పటికు ఆంధ్ర విశ్వవిద్యాలయం ఎంతో దూరం లేదు. గవర్నమెంటువారి పిచ్చి ఆసుపత్రి కూడ చాల దగ్గరలోనే వుంది. సముద్రపు గాలికి కొబ్బరి కొమ్మలు ఊగుతున్నాయి. నిర్మానుష్యంగా వున్న ఆ స్థలంలో రామం ఒక దెయ్యంలా ఇసుకలో కూర్చున్నాడు. చంద్రుని పొగమబ్బులు మరింత కళావిహీనం చేశాయి. కెరటాలు కొండచలువల్లా కదులుతున్నాయి. సముద్రగర్భంలో సగం పాతుకపోయిన మెట్ట వుండివుండి పైకెగసినట్లు భీకరంగా కనిపిస్తోంది.

ఈ లోకంలో ప్రేమకూ, బ్రతుకుకూ అర్థంలేదు! అలాంటప్పుడు మనిషి బ్రతికి చేసిందేమీ లేదు. ఈ నైచ్యాన్ని, బాధని కళ్ళారా చూడకుండా వుండటమే మంచిది. మెల్లిగా లేచి నిల్చున్నాడు. మానసమంతా దుఃఖాంధకారంతోను, జిగిబిగితోను నిండిపోయింది. మంచి ఆలోచనలకు చోటులేని మనస్సు కల్లోలమై ప్రశాంతత కోసం ప్రాకులాడింది.

హోరుమని శబ్దంచేస్తున్న కెరటాలను త్రొక్కుకుంటూ మోకాళ్లవరకూ నీరు వచ్చేలా నడిచాడు. ఫెడేల్ ఫెడేల్‌మని తరంగాలు గుట్టను కొడ్తూంటే తనను ఎవరో లెంపలు వేస్తున్నట్లు అనిపించేది. గంభీర భీకర సముద్రంలో యెంత ప్రశాంతత! ఆ భీకరత్వం మనస్సును భయపెట్టి, ఆత్మను మేలుకొల్పింది. ఆ మేలుకొలుపు మనసులో మూడుమైళ్ళ దూరంలోవున్న ఒక కంపు సందులోని పాడుగోడమీద బొమ్మను జ్ఞప్తికి తెచ్చింది.

కెరటము పాదాలక్రింద గోతిని చేసిపోయింది. ఇంకో కెరటం వచ్చేసరికి ఒడ్డుమీద శాంతచిత్తుడై నడుస్తున్నాడు. ఇంతవరకూ ఇదంతా ఒక పాడుకలలా అనిపించింది. ఎకాఎకి కాదంబరవారి వీధిలోనికి వెళ్ళాడు. మురుగుకాలువ కంపు బ్రహ్మాండంగా వుంది. ఆ పాడుపడిన గోడ, వెనుక పడిపోయిన ఇళ్ళు, తుప్పలు మొక్కలు బలిసివున్నాయి. దయ్యంలా ఒక తోపాయి చెట్టు ఆ గోడప్రక్కనే వుంది. మసి బొగ్గుతో అష్టవంకరలతో గోడమీద గీచిన ఆ బొమ్మవేపు ప్రశాంతచిత్తుడై, భక్తితో చూశాడు. గడిచిపోయిన నిరాశాయుక్త నిముషాలను లెక్కించుకుంటూ, నవ్వుకుంటూ ఇంటిముఖం పట్టాడు.

ఆరాత్రి జానకి మేడమీదకు వచ్చేసరికి బాగన్న నిద్దురపట్టింది. తెలివి వచ్చేసరికి తన పాదాలదగ్గర నిల్చోవటం లీలగా చూశాడు. భర్త కదలటం చూసి తన పరుపు మీదికి వెళ్లిపోయింది.

కొంతసేపయ్యాక రామం లేచాడు. ఒంటిగంట దాటింది. టేబిలుమీద మూతపెట్టబడివున్న పాలగ్లాసు తీసుకున్నాడు. పాలుత్రాగాడు. ఇంతవరకూ జానకి నిద్రపోతున్నట్లు నటించింది. రెండువేపులా కిటికీ క్రింది రెక్కలు మూసివేసి కుర్చీమీద ఒక్కక్షణం కూర్చున్నాడు. మళ్లీవెళ్లి పరుపుమీద పడుకున్నాడు.

తెల్లవారింది. స్నానంచేసి వస్తూంటే రామాన్ని పెద్ద బావమరది కాఫీకి పిలవ

డానికి వచ్చాడు. మీ అక్కడు ఒకసారి రమ్మంటున్నానని మెల్లగా వెళ్ళిచెప్ప మన్నాడు. కొద్దినిమిషాలలోనే జానకి మేడ మీదికి వచ్చింది.

"ఈవేళనుంచి కాఫీ త్రాగను. ఇప్పటి నుండి మానివెయ్యాలని నిర్ధారణకు వచ్చాను."

జానకి మాట్లాడలేదు. తలదించి తలుపుకు చారబడి అలానే నిల్చుంది. రామం జానకి దగ్గరగా వచ్చి ఆమె చెయ్యిపట్టుకుని, రెండవచేయి ఆమెభుజంమీద వేస్తూ గదిలో ఒకమూలకు తీసుకవెళ్ళాడు. వంచిన ఆమె ముఖంఎత్తి సగంమూసిన కళ్ళలోనికి చూస్తూ, "కోపం అంతా నామీదనే చూపించాలా?" అంటూ ఆమెను దగ్గరగా తీసుకుని కౌగలించుకున్నాడు. జానకి అలసిపోయి అతనివక్షముపై వ్రాలిపోయింది. కన్నీరు ఆమె చెక్కిళ్ళపైనుండి జలజల ముత్యాలుగా రాలిపోతున్నాయి. రామం ఒకక్షణం పెదాలు బిగపట్టి ఆ ముఖంవైపు చూసి కన్నీరుతుడుస్తూ, "పిచ్చిదానా! నేనుమాత్రం మనిషికాను? ఆ ఆస్థిమీద నేనుమాత్రం తక్కువ ఆశపెట్టుకున్నానా? అటు వాళ్ళపరిస్థితి కూడ చూడాలా?"

మనస్సుకు హత్తుకపోయేటట్లు భర్త చెప్తూంటే, జానకి బెదురుచూపులు రాను రాను పోయి ముఖం తేజోవంతమయింది.

## 15

సుందరమ్మ ఆ మరుచటిరోజు సాయంత్రం కాలుకాలిన పిల్లిలాకావటం అల్లుడు గుర్తించి, చడీచప్పుడు చెయ్యకండా మేడ మీదకు వెళ్ళిపోయాడు. జానకి యీవేళ కాఫీ మేజమీదకే తెచ్చింది. ఇద్దరి మనోభావాలు మౌనంగానే వున్నాయి. అల్లుడు బయటకు వెళ్ళిపోతున్నప్పుడు అటువేపు కన్నెత్తిచూడకండా అత్తగారు వ్రాల్చిన పదములను పొల్లుపదములుగానే స్వీకరించాడు.

దీపావళి వచ్చింది. ఈ మధ్యను జానకి బహుశః తల్లిమాటను కాదనలేక మూడుసార్లు ఆస్తివిషయమై ప్రస్తావన తెచ్చింది. రామం తెల్లముఖంవేసి చూశాడు. అంతే.

ఆనాడు సెలవైనా యింటివద్ద లేడు. సుందరమ్మ పిండివంటలు జోరుగానే తయారుచేసి అల్లుడుకోసం కాళ్ళు చాచుకుని అంగటిగదిలో కూర్చుంది. రామం చీకటిపడ్డాక వచ్చాడు. ఆ భారీశరీరాన్ని తేలిగ్గా ఎత్తి నిల్చుని, "పండగపూటైనా యింట్లో వుండద్దా నాయనా!" అంది. వంటకాలు స్వంతంగా యెదురుగాపెట్టి, అల్లుడు పీటమీదనుండి లేచేవరకూ శ్రమ అనకండా నిల్చునే వుంది.

రామం మేడమీదకు వెళ్ళాడు. డాబా అంతా దీపాలమయమై వుంది. రూపలావణ్యసుందరి, గోడకు చారబడి నిల్చున్న భర్తవైపు పొంగిపొరలే ఆనందంతో వుల్లాసంగా కూనిరాగం తీస్తూ చూసింది. రామం అక్కడ నిల్చున్నా మనస్సు అక్కడ లేదు. జానకి యౌవనగర్వంతో సుకుమారత్వాన్నంతా మూర్తీభవింప చేసికుని, చేతిలో వెలుగుతున్న కాకరపువ్వొత్తిని గిరగిర త్రిప్పుతూ భర్తయెదురుగా నిల్చుని క్రీగంట చూసింది. ప్రియమైన ఆ లేనగవు భర్తపెదాలమీద ప్రసరించక పోవటంతో చిన్నబుచ్చుకుని కాలుతున్న కాకరపువ్వొత్తిని క్రింద పడవేసి, ముఖం ముడుచుకుని నిల్చుంది. బుచ్చిగాడు పరుగున వచ్చి క్రింద కాలుతున్న కాకరపువ్వొత్తిని పట్టుకుని వెళ్ళిపోయాడు.

రామం అక్కడ నిల్చోలేదు. మనస్సులో రేగిన గత స్మృతులు నిల్చోడానికి

# ★ గోడమీద బొమ్మ ★

శక్తినీయలేదు. గదిలోనికి వెళ్లి కుర్చీమీద కూర్చున్నాడు.

1945-వ సంవత్సరంనాటివిషయం. జూలైనెల పదవతేదీన రంగయ్యగారు రాజమండ్రి చుట్టాలింటికి వెళ్లారు. ఇన్నీసుపేటలో ఆయింట్లో యీ చుట్టాలతో యింకో కుటుంబంవారు కూడ రెండో భాగంలో వుంటేవారు. ఆరెండోయింటావిడ గయ్యాళి. ఆవిడ కొట్టినా, తిట్టినా అప్పటికి తొమ్మిదేళ్ల పిల్ల పార్వతి నానాచాకిరీ చేస్తూ, సహించటం, అప్పుడప్పుడు తలుపుచాటున చేరి గట్టిగా ఏడిస్తే మేనత్తకు యెక్కడ వినిస్తుందనో మెల్లగా మూలుగుతూ, కన్నీరు కార్చటం రంగయ్యగారా రెండురోజుల్లో చూశారు. అభిమానం చెల్లుబడికి ఆ పిల్ల విషయం భోగట్టా చేశారు. పార్వతి కడుపులో వుండగానే తండ్రి చనిపోయాడట. అన్నయ్యయింటికి చేరుకున్న తల్లి పిల్ల ఐదో ఏట పోయింది. రంగయ్యగారి మనస్సు కరిగి యిటువంటి మంచిపిల్ల తన కొప్పిస్తే కొడుకునకు అనుకూలమైనభార్య అవుతుందని ఆ యింటివారికి యెన్నోవిధాల నచ్చచెప్పి వారు అభ్యంతరపెట్టే ఆ సంవత్సరమే పెళ్లి కూడా చేస్తానని చెప్పి పార్వతిని తనవెంట తీసికొని వచ్చారు. ఇంట్లో కాలుపెట్టగానే, "ఇదిగో బాబూ! నీ చెల్లెలును తెచ్చాను. ఇక నీ యిష్టం! ఎంత విజ్ఞానవంతురాలిగా చేస్తావో" అన్నారు.

క్రిందటి దీపావళికి పార్వతి యొక్క మృదులమైన మనస్సంతా వింత వింత ఆలోచనలతోనూ, కోరికలతోను నిండుకుంది. ఉత్సాహంతో పండగను వైభవంగా జరిపింది. ఆనందం వెల్లివిరయగా తనకూ, బావకూ మధ్యనిల్చుని అంది. "వచ్చేయేటికి అత్తారింటికి వెళ్తావుకాబోలన్నయ్యా! మామయ్యతో చెప్పి మరీ ఆపేస్తాను. వదినా నేనూ అంతా కలసి యిక్కడే బాగా పండగచేసుకుందాం!" అప్పటికింకా యీ సంబంధం నిర్ణయంకాలేదు. కాని ముసలాయన రాముం పెళ్లి వెంటనే కావాలని బలవంతంచేస్తున్నారు. ఈ దీపావళికి అంతా మారిపోయింది! ఆయింటిలో మెసలిన అందరి హృదయాల్లోనూ అమావాస్య చీకట్లు ఆవరించుకున్నాయి. తను ఏనాడూ ఆ యిల్లు కదులుతానని కలలోనైనా అనుకోలేదు' తన యిల్లనే మమకారం తనకేనాటికీపోదు' మామయ్య అనేవారు. "వాడా అండీ! మూలానక్షత్రంలో పుట్టినా చంద్రహాసుడిలాంటి అదృష్టజాతకుడండీ! వాడినీ యింటికితెచ్చాను—నా రోజులు బాగు వచ్చాయి. ఆ రెండో యేటనే భద్రం పుట్టాడు."

ఆ మాటలు వింటున్నప్పుడల్లా తను సిగ్గుపడుతూనే మనసులో ఎంతగానో పొంగిపోయేవాడు! బావ సరిగ్గా చదవకుండా, కోర్టులో కూర్చుని వీలయినప్పుడు డబ్బులు కాజేసి, యింట్లో వుంటే తల్లిని అల్లరిపెట్టి, సినిమాలకు, సిగరెట్లకు విపరీతంగా డబ్బు పోస్తుంటే మామయ్య కలుగజేసికుని "వాడ్ని చూసైనా బుద్ధితెచ్చుకోరా" అని మందలిస్తుంటే అదోకవిధమైనగర్వం మనసులో చొచ్చుకపోయేది.

ఒక పవిత్రమైనవస్తువునుగానీ, మనిషినిగానీ చూచినా తలచినా లేక తాకినా, ఒక సుజనునిలో కలిగే నిర్మలానందానుభూతి మామయ్యగార్నిగురించి తలచు



కున్నప్పుడు, చూచినప్పుడు అట్టి అనుభూతి పొందుతూ వుంటాడు. మూడువంతులు పండిన జుత్తుతో, పసుపురాసుకోవటంవల్ల ఆర మగ్గిన మామిడి పండుఛాయ శరీరవర్ణంతో, అమాయకం ముఖాన మూర్తీభవించినఅభిమానవతి మేనత్త. అరమరికలు లేక అంతులేని అభిమానంతో ఆదరించే తల్లి - వీళ్లందరి ప్రేమ వెలుగులా వుంటుంటే-తను జీవితంలో దారికోసం తడుముకోనక్కరలేనట్టే బ్రతికాడు. అటువంటి ప్రమోదమైన వాతావరణంలో ఒక్కసారి పెను తుఫాను లేగి తనను బలవంతాన మిరపకాయలు పొగపెట్టిన గదిలోనికి త్రోసివేసినట్లు యీ అత్తవారిల్లు వుంది. అర్ధాంగి దగ్గరగావున్నా యిన్నాళ్లూ యీ వాతావరణం అలవాటు పడకపోవటంవల్ల వుక్కిరిబిక్కిరై మనస్సు పట్టు తప్పింది. ఇప్పుడిప్పుడే కొద్ది కొద్దిగా యీ పరిసరాలకు అలవాటుపడటంవల్ల అత్తగారి మాటలు అక్కడే విడిచిపెట్టడం నేర్చుకుంటున్నాడు.

గతస్మృతులు జ్ఞప్తికి తెచ్చుకొని అలా వాలు కుర్చీమీద కూర్చుని వుంటే సుందరమ్మ కష్టంమీద మెల్లిగ ప్రాకి వచ్చింది. అల్లుడివేపు చూచి ముందుకుసాగి చూచేసరికి యిద్దరు పిల్లలు ఒకరినొకరు పీకుకుంటున్నారు. తల్లిని చూడగానే బుచ్చిగాడు పరుగునవచ్చి ఏడవటానికి వుపక్రమించాడు. పెద్దవాడు తమ్ముని వద్ద లాగుకున్న మతాబా వెలిగించేశాడు. దానితో బుచ్చిగాడి ఏడుపు హెచ్చిపోయింది. సుందరమ్మ శాంతంగా కొడుకును ఓదారుస్తూ, "మీ బావ రేపు యిన్ని మతాబాలు తెచ్చి యిస్తాడులే, చవితినాడు నువ్వొక్కడివే కాల్చుకుందువుగాని - నన్నడిగితే నేనెక్కడ తెస్తాను. మీకేం కావాలన్నా బావ నడగండి." అంటూనే,

"భోజనం చేద్దువుగాని నడు" అంటూ కొడుకుని తీసికొనిపోతూంటే వాడు ఏడుస్తూనే బావగారివైపు చూశాడు. వాడి వెనుకనే పెద్దవాడు వెళ్ళిపోయాడు.

అత్తగారి మాటలకు తృప్తివహించిన రామం లేచి జానకి దగ్గరకు వెళ్లాడు. టెర్రస్ పడమటవేపు గోడకు చేరబడి జానకి చీకటిలో కూర్చుంది. అటువేపున్న దీపాలు ఆరిపోయాయి గాలికి. రామం దగ్గరగా వెళ్ళి డాబా పిట్టగోడకు చేరబడి నిల్చుని, మింటిలో చుక్కల మిసమిసల వేపు చూస్తున్నాడు. సముద్రముపైనుండి చల్లని గాలి జోరుగా వీస్తోంది. చప్పున మీదకులేచిన తారాజువ్వలు ఒక్కసారి క్రిందికి శక్తివుడిగి జా[illegible] ...నూ. బహుశః అత్తగా...

అలాగే కాబోతున్నారా అన్న వూహా తట్టింది. ముందురోజు ఆమె పొరుగు ముఖలమ్మతో అంటున్న మాటలుకూడ తనిలా అనుకోటానికి కారణమౌతున్నాయి. ఆమె అన్నది, "నేను పుట్టికట్టుకుని యెప్పుడూ ఇలా వూగులాడుతానా? అల్లుడు యీ రోజు కాకపోతే, రేపైనా యీ భారమంతా మొయ్యడా? ఆస్తిపాస్తులా - ఎలా జరగాలని దేముడు వ్రాశాడో అలాగ జరగక ఏమవుతుంది?" ఈ విషయం తల్చుకొనేప్పుడు తారాజువ్వ మీదకులేచి రంగురంగుల పువ్వులను దిగజార్చింది. విదలింపబడిన రంగుపూవులు మెల్లగా గాలికి వూగిసలాడుతూ దిగుతూంటే కళ్ళప్పగించి చూస్తున్నాడు. తరవాత వెంటనే భార్యముఖంవైపు చూశాడు. ఆమసక వెలుగులో ఆమె కంటినీరు తళకుమని మెరసింది. చప్పున వంగొని ఆమె ప్రక్కన డాబాకు చేరబడి కూర్చుని, ఆమె భుజం పట్టుకుని దగ్గరగా చేరదీసుకున్నాడు. కళ్లు కప్పుకుని ముఖాన్ని తన వక్షం ఎదురుగా వంచిన భార్య భుజం మీద గెడ్డం ఆన్చి ఆమె చెంపకు తన చెంప ఆన్చి నిమురుతూ, మాటలు రాక మరి కొంచెం దగ్గరగా లాగుకున్నాడు. పులకరించిన ఇరువురి దేహాలు ఏకమయినై!

చుట్టుప్రక్కలవున్న ప్రమిద లన్నిటిలోని దీపాలు ఆరిపోయినయి. దట్టమైన చీకటి నలుమూలలా ఆవరించింది. అంతవరకు విజృంభించిన దీపావళి తిరుగుముఖం పట్టింది. ఆ దగ్గరగానే డాబాకు వాయవ్యమూలలో పెద్దగోళెంలో క్రోటన్స్ మొక్కకు అలముకున్న సన్నజాజుల తివ్వ గాలికి ఆడుతోంది!

తిరిగి చైతన్యానికివచ్చాక జానకి నిష్ఠూర వాక్యాలు మొదలుపెట్టింది. పండగపూటైనా ఇంట్లోలేకండా, రోజుకు రోజూ ఇంట్లో చుట్టంలా మెసలటం గురించి నిరసిస్తూ చివరకు ఆస్తివిషయం తెచ్చింది. రంగయ్యగారి ఇంట్లో అందరూ తనను మర్చిపోతూంటే యింక అభిమానా లెక్కడ వుంటాయి - యీ మేడ ఆస్తిఅంతా తమ్ముళ్లదని అమ్మ చెప్పిందని జానకి అంటుంటే రామం మనసులో మళ్లీ వెంకట్రావు ప్రత్యక్షమయ్యాడు. తరవాత కొంత

# ★ గోడమీద బొమ్మ ★

గంభీర స్వరంతో భార్యవేపు చూడకం డానే అన్నాడు. "ఇక మీరంతా ఇంత పట్టుదలతో వుంటే బహుశః నేను ఇల్లు కదలవలసి వుంటుంది." జానకి ముఖంలోనికి చూస్తూ నిమ్మళంగా, "నేను కావలసి వుంటే నాతో వస్తావు."

తరువాత ఆమెను లేవనెత్తి చేయిచేయి కలిపి గదిలోనికి తీసుకపోయాడు. బట్టలు మారుస్తూండగా జానకి ఎంతోరహస్యం నివేదించినట్లుగా, "అమ్మ ఆస్థి యివ్వదట! వాళ్లూ యివ్వకపోతే జీతం చాలుతుందీ! అమ్మ మన మంచికేకదా చెప్తూంది!"

రామం అప్రయత్నంగా నవ్వేశాడు. భార్యయందు జాలివేసి చప్పన ఆమె ముక్కు పట్టుకుని వెక్కిరిస్తూ, "నిన్ను యింతకన్నా మంచిమేడలో మహారాణిలా వుస్తానే!"

ఆమరుచటిరోజు వుదయం బుచ్చిగాడి చేతికి సంచియిచ్చి బావతో బజారుకు వెళ్లు నాయనా అంది. రామం యింత సదుద్దేశంతో అత్తగారు మొసలటంతో కలుగ జేసికుని, "ఏం తెమ్మంటారు?" అంటూ సంచీ లాగుకున్నాడు. సుందరమ్మ జానకి వైపు తిరిగి, "ఏంకావాలో చెప్పమ్మా" అని అక్కడనుంచి తప్పుకుంది.

జానకి నవ్వుతూ, "బజారంతా కావాలి" అంది.

తను యీ యింటికి వచ్చాక యింటి బాధ్యత తీసుకోవటం యిదే మొదటిసారి. ఉత్సాహంతో వున్న మనసులో మాటి మాటికి మామయ్యగారు వచ్చేముందు అన్న మాటలు కదులుతూనే వున్నాయి.

రెండోరోజురాత్రి కొడుకులిద్దర్ని ప్రతిమాలుతోంది దీపం వెలిగించగానే బావ దగ్గర చదువుకోమని. ఈ మాటలు విన్న రామం గదిబయటకు వచ్చి చదువు చెప్ప టానికి వుపక్రమించాడు.

ఇంకోరోజు అల్లుడు ఆఫీసునుండి రావటం కిటికీలోనుండి గమనించి, కూతు రితో అంటూంది. "నివ్వేమీ అనకమ్మా! ఇన్నాళ్లూ తెలియక ఏదో అనేశాం! మనస్సు విరిస్తే మనకే నష్టంగా!" అల్లుడు యీ మాటలు వింటూ తలుపుత్రోసుకు వచ్చాడు.

రోజుకిరోజు యింటిబాధ్యతలు అత్త గారు తనకు ఒప్పచెప్తూంటే రామం సంతోషంగా స్వీకరిస్తున్నాడు. ఆస్తి పాస్తుల విషయంకూడ చెప్తూంది. పెట్టెలోవున్న పద్దులు తీసి చూపించింది. 'ఈ ఇద్దరుపిల్లలూ యిప్పుడే చెప్పినమాట వినకున్నారుకదా పెద్దయితే, నా ఒకేఒక కూతురుకు అన్యాయం చెయ్యరూ? ఇదంతా దానిదే!" అని ఒక చిన్న పెట్టెలోని బంగారువస్తువులను చూపించింది. రామం మామయ్యగారింట్లోను యింతబంగారం చూడలేదు.

ఇంతమార్పుకు కారణమేమిటాయని రామం ఆలోచించకపోలేదు. తను లోతుగా ఆలో చించకపోవటానికి కూడ కారణం లేకపో లేదు. మర్నాడు జానకి చెప్పింది. నాన్న అమ్మకు కలలో కనబడి అల్లుడ్ని సరిగ్గా చూడటం నేర్చుకోమని కోపగించాడుట! అత్తగారికి భర్తమీద వుండే భక్తి యీ

మార్పుకు కారణమై వుంటుందని అనుకున్నాడు.

సుందరమ్మ అనుకున్నట్లే పులపర్తినుండి వుత్తరం వచ్చింది. ఆ వుత్తరం అల్లునిచే చదివించాక, "ఉత్తరాలలోనే యీ వినయాలు, యీ వినయాలు. ఈ రైతులు క్రిందటి సంవత్సరం సరిగ్గా ధాన్యం యిచ్చారా? వాళ్ళు యిచ్చివుంటే మనం గొడ్లు తినని బియ్యం తినవలసిన ఖర్మమేమొచ్చింది? ఆడమ్ముండదని వాళ్ళకి నీరసంగా వుంటుంది."

అత్తగారు యింతో అని తనను వెళ్ళమంటుందేమో అని అనుకున్నాడు రామం. కానీ ఆమె నోటివెంట ఆ మాట ఆ రోజు రాలేదు. సుందరమ్మకు ఎలమంచిలి దగ్గర యీ పులపర్తి గ్రామంలో ఆ దగ్గరగావున్న పద్మరాజుపాలెంలోనూ భూములున్నాయి. ఈ భూములు పాలుభూములు. కోతలు జరిగే పదిహేను రోజుల్లోనూ, వాళ్ళవారెవరైనా మడిగట్టున వుండాలి.

రామునకు నిజానికి వెళ్ళాలనే వుంది. పదిహేను రోజులపాటు వాతావరణంలో కొంతమార్పు వుంటుందనీ, అదీగాక తను యింటి బాధ్యతను పూర్తిగా స్వీకరించాలనే కుతూహలపడుతున్నాడు. కనుక తను వెళ్తానని అత్తగారితో అందామనుకుంటే ఆ మరుచటిరోజు ఆమె అడిగింది.

"శలవు దొరుకుతుందా, నాయనా?"

రామం వుత్సాహంతో, "దొరుకుతుంది" అన్నాడు. సుందరమ్మ తనతో ఆ నెల (నవంబరు) యిరవయ్యో తేదీ వుదయం బండిలో రాముని తీసుకునివెళ్లి రైతు లందరికీ పరిచయంచేసి రాత్రిసరికి తిరిగివచ్చెయ్యాలని నిర్ణయించుకుంది. ఆ పదిహేనురోజులు పులపర్తిలో వున్న కాస్త దూరపు బంధువుల యింట్లో భోజనసదుపాయం ఏర్పాటు చేస్తానంది.

తను ప్రయాణమవుతా తనగా ముందు నాటి సాయంత్రం వెంకట్రావు సుందరమ్మ యింటికి వచ్చాడు. రాముని చూచి, "బావా! నాకు సైట్ డ్యూటీ తగలడింది. దివ్యదృష్టిలో చూచినా నువ్వెక్కడా కనపడడం లేదే?" అన్నాడు.

రామం ఖ్యాతంగానే, "మా రెక్కడికీ ఎగిరిపోలేదులే బావా!" అన్నాడు. సుందరమ్మ యింతలో అప్పుడే తయారుచేసిన కాఫీఫలహారము లమర్చింది. "సాయంత్రం నేను వుత్తకాఫీయే త్రాగుతానండీ. టిఫిను పద్ధతిలేదు" అన్నాడు వెంకట్రావు. సుందరమ్మ బలవంతం చేసింది.

వెంకట్రావు దంచన్‌గా అన్నాడు. "ప్రిన్స్‌పుల్స్ లేని మనుష్యులెందుకండీ! మహామహులంతా నూరేళ్లు బ్రతికారంటే వాళ్లు సాదర్నాగా వున్న ప. . ఏం తిన్నారో, ప్రిన్సిపుల్స్ అయ్యాక అదే తిన్నారు. ఈరోజు వున్నదని పంచభక్ష్య పరమాన్నములు తిని రేపు లేదని అంబలి త్రాగేవాడిదీ బ్రతుకే!"

టిఫిను ముట్టుకోకండా కాఫీ సేవిస్తున్న బావవేపు రామంచూసి చిరునగవుతో, అత్తగారితో అన్నాడు. "ఆవకాయముక్క, కాస్త మంచినీరు యివ్వలేకపోయారూ?"

వెంకట్రావు ఆ మాటలు క్రిందపడనీయకండానే "నీకేం తెలుసుబావా! ఆవకాయలోవున్న సారం! ఆ దొరలకాలంలో ఛీఫ్ జస్టిస్‌పని చేసిన వేపా రామేశంగారు ఆవకాయలేనిదే అన్నం ముట్టుకోరట! జర్మనులు కెమికల్ ఎనాలిసిస్ చేసి ఆవకాయ తాలూకు గొప్పతనాన్ని ప్రపంచానికి చాటారు."

రామం ఘొల్లుమన్నాడు. వెంకట్రావు ఏమాత్రం మారకండా ఆ పోజులోనే, ఆ ధోరణితోనే తలపంకిస్తూ, "పట్టభద్రుడివి — నేను విడదీసి చెప్పవలసివచ్చింది కదాయని విచారిస్తున్నా! వాళ్లేం వెర్రివెధవలుకారు. మనిషి ఘుస్తాకైనా హెల్త్ మెంటయిన్ చెయ్యాలంటే, రోజుకి రెండున్నర ఔన్సులైనా వుప్పుతినాలి. ఆవకాయితింటేగాని యింకో విధంగా వుప్పు శరీరంలోనికి వెళ్లదు."

అందరూ ముసిముసిగా నవ్వుకుంటుంటే వెంకట్రావు కెంతో ఆనందం వేసింది. ఒకరు తనను పొగుడుతున్నారంటే అది తాటాకులు కట్టడమని ఆయన లేశమాత్రం వూహించడు. అదే ఆయన గుణగణాల్లో విశిష్టమైనది. ఇంక తన ప్రతాపం చూపించడానికి యిది పెద్దదైన వాతావరణం. "బావా!" అన్నాడు. కాఫీ చివరిబొట్టు నోటిలో పోసుకున్నాక, "నాకు వెధవది నేముడు దూరదృష్టి యెందుకిచ్చాడా అని విచారిస్తుంటాను. నీకు జ్ఞాపకముందా ఆ రోజు ఏం చెప్పానో!"

వెంకట్రావు చెప్పినది ఆయన తల్లి వీరో ముక్క అందిస్తేగానీ రామానికి జ్ఞప్తికి రాదు.

"విరా బావక్, ఆ పట్టభద్రవెధవకి వున్న సంబంధం! బాగా దెబ్బకుంజేశాడోయ్! కాకపోతే వాడీ జన్మలో ఆ పిల్లల తల్లిలా వున్న పూతురికి పెళ్లి చెయ్యగలడూ?" "సంతోషమైన వార్త చెప్పావు బావా?" అన్నాడు రామం. వెంకట్రావు ఎలక్షన్లో ఓడిపోయిన మంత్రివర్యునిలా కబుర్లాడాడు.

"నలుగురినోటి బుకాయింపు నమ్మి నువ్విలా అనేశావు బావా! వాస్తవం నీకు తెలీదు. అదే నీకు తెలిసుంటే యింగిత జ్ఞానం వున్నవారిలా నివ్వూ నాకు బ్రహ్మరథం పట్టేవాడివి. సెంట్ పరసెంటు నిజం తెలిస్తేగానీ నే నేమాటా అడను. నా నిజాలన్నీ కోతలని నామీద చెప్పులులాంటి మాటలు విసిర్తే అటువంటివాళ్లింకా అజ్ఞానంలో వున్నారని విచారిస్తుంటాను.

"ఏమే అమ్మాయ్! మీ క్రొత్తకాపురం ఎలా వుందే?"

"వంక పెట్టటానికి వీల్లేదే అమ్మా!"

"అదేమిటే-మీ అత్తగారేమో కొంచెం గడుసురకం మనిషి అన్నట్లుగా మీనాన్నగారు నాతో అన్నారే!"

"వంక పెట్టటానికి వీల్లేదే అమ్మా!"

"అదేమిటే - విచిత్రంగా మాట్లాడుతావు"

"నామాట నమ్మకం లేకపోతే, అక్కడికొకసారి వచ్చి వంక పెట్టి చూడు. తెలుస్తుంది!"

సుందరమ్మ కలుగజేసుకుని, "మనిషి విలువ మాట చెప్తుందండీ! మీ మర్యాదా మంచీ యింకొకరికి వస్తాయా? కిట్టనివాళ్లన్నీ అనుకోనీయండి మీ కేం!"

వెంకట్రావు చలికాలంలో వేసవి క్రాఫ్ చెయ్యించుకున్న తల సుందర కొంకాయలా వుంది. ఒకసారి తల తడుముకుంటూ ఆవులింతతీసి, "ఈవేళ సాయంత్రం రాయపూరుబండిలో ఆ మంత్రివెధవని కొట్లోవెట్టి ఆ కిష్టయ్య మా బావా విజయనగరం సంబంధంకోసం వెంకేశారోయ్ బావా!"

రామం యీమాటలు వెంకట్రావు నిర్లక్ష్యంగా అంటున్నా ఎంతో సంతోషంగా స్వీకరించాడు. ఈ మాటలు వినగానే వున్నపాటున, "బావా! మాట్లాడుతూండు. ఒక స్నేహితుని దగ్గరకు వస్తానన్నాను; చెప్పి మరీ వచ్చేస్తాను." అని బయటకు వెళ్లిపోయ్యాడు. పదిహేను రోజులు తను వూర్లో వుండనని మామయ్యగారితో చెప్పాలనే కుతూహలం, అందరినీ ఒకసారి చూడాలనే భ్రాంతి తనకు రెండు రోజులై కొట్టాడుతూనే వుంది. ఇటువంటి

( -వ పేజీ చూడండి)

మా పాఠశాలలో కూర్చుంటే పై భాగం తప్ప అష్టదిక్కులందుకొనే ఆకాశం దొరటోళ్ళీ అంచులా కనుపిస్తుంది. మా తలలపై కూడా సూర్యుని చేతులు రూపాయిల్లా, నైజాం పాత అర్ధణాలంతగా వచ్చేసి నాట్యం చేస్తుంటాయి. పాటిదుమ్ముదేవరమాత్రం పావుగంట కోసారిగాని, దయవస్తే యింకా త్వరత్వరగానే అల్లిబల్లిగా ఆడుకొంటూ వచ్చి, మా కండ్లు మూసి, దాగుడుమూతలాడుతుంటుంది. ఒక్కొక్కసారి ఆమెకు కోపం రావడంకూడ సహజమే. అప్పుడామె బడివసారాల్లో పుల్లలన్నింటిని చదువుకోమనిచెప్పి, వాటిని బళ్ళోకి రాని పిల్లాణ్ణి లాక్కొచ్చినట్లు తీసుకవచ్చి పుస్తకాలపై పడవేస్తుంది. అప్పటికి పుస్తకాల పైకాగితాలలో వుండే రసజ్ఞతంతా పిపీలికా కణజాలంతో సహా ఆస్వాదించాల్సిందే! స్కూళ్ళ యిన్స్పెక్టర్లకైనా జాలి కలుగుతుంది గాని ఈ సుంద్రదేవరకు మాత్రం కనికారమనేది ఏకోశానా లేదు. పని గట్టుకొన్నట్లు విజిట్లపై విజిట్లుచేస్తూ మా తలకాయలను దిమ్మెక్కించడమే ఆ తల్లి ఆదర్శం.

ఈమెకు తోడు మా పాఠశాల గడియారాలు. భుక్తాయాసపు మహిషవాహనంలా పనిచేస్తుంటాయ్. అందులో మా ఉపాధ్యాయుల కళ్ళెప్పుడూ వాటిపైనే వుంటాయ్ కాబట్టి, మమ్ము వెక్కిరిస్తున్నట్లు యింకా మందగమనంతో నడుస్తుంటాయి. జిల్లాబోర్డువారు ఇద్దరు ఉపాధ్యాయులకు సరిపడే కొయ్యసామాను సప్లయిచేశారు. క్రొత్తగా స్థాపించబడిన పాఠశాల కాబట్టి, మా ఇద్దరకూ పనికి తరుగులేదు—కాని, వసతి మాత్రం వర్ణించనలవిగాదు. గ్రామస్థులంతా ముందెప్పుడో మంచి యిల్లు కట్టారని వినికిడి—అలానే మేమిద్దరం చేరి ఒక తాలూకా నుండివచ్చి కాలక్షేపం చేస్తున్నాం.

*　　　*　　　*

మే మిద్దరం క్రొత్తగా ట్రైనింగు స్కూళ్ళనుండి బయటపడ్డవాళ్ళం. మెథడ్సు ప్రకారం, టీచింగు చేయడం, సైకలాజికల్, పద్ధతిని అనుసరించడం జరుగుతోంది." కాని మేము స్కూలు ప్రారంభించిన నాటికి పిల్లలవద్ద సుమతి శతకాల్లాంటి పుస్తకాలు, తలా ఒకటి మాత్రమే వున్నాయి. లోగడవాళ్ళకు చెప్పిన అయ్యవారు వీనినే క్లాసు బుక్సుగా పెట్టారట. ఈ విషయంగురించి కొందరి తల్లిదండ్రులతో అవి పనికిరావని చెప్పాను. కాని ఎవ్వరూ ఇతర పుస్తకాలు తెప్పించలేదు. ఈ విషయం గురించి కొందరకు అసంతృప్తిగా వున్నదని పిల్లలద్వారా తెలిసింది.

ఇదేమిటంటే 'వీటిలో ఏముంది? ఆవుకు నాలుగు కాళ్ళు; కోడికి రెండుకాళ్ళు—యింతే వుంటాయ్—యీ పుస్తకాలు చదివితే వున్న తెలివికూడా పోతుంది' అని కొందరంటున్నారు. అయినా యింతవరకు మమ్మల్ని బయటకుపిల్చి ఎవ్వరూ అడుగలేదు.

కాని, సెలవుల విషయం మాత్రం కొందరు ముఖంమీదే అడిగేస్తున్నారు. "శనివారం ఒక పూటేంటండీ? ఆదివారం

శ్రీ రా[illegible]

రామకో[illegible]

ఆదివారం సెలవెందుకండీ?" అని ఒకరు—"యిదివరకు చెప్పిన మా ఆచారిగారు ముప్పూటలా చెప్పేవారు. అమాసకు, పున్నానికే గాని సెలవిచ్చేవారుగారు." అని మరొకరు—యిలా అంటుంటే ఏదో సర్ది చెప్పి తప్పుకొంటూ తిరిగేవాళ్ళం—.

"అన్నిటికంటే గొప్పవిషయం ఏమిటంటే! చాలామంది గ్రామపెద్దలు జానెడు జానెడు పొరచుట్టల ధూమంతో పాఠశాల సాంతం నింపేవారు. కొందరిని మెల్లగా కదిలించాం. బళ్ళో పొగ త్రాగరాదని—. కాని, 'ఐతేమాల్లేండి! యిప్పుడేం పరీచ్చ పంతులుగారు రాటంలేదుగా!' అనేవాళ్ళు. యిలానే భరిస్తూ జీవయాత్ర సాగిస్తున్నాం.

ఒకనాడు యథాప్రకారంగా మా బడి దినకృత్యాలు నిర్వహిస్తుండగా ఎనిమిదిన్నరైంది. ఇంతలో వీరభద్రయ్యగారు వచ్చారు. ఈయన చిన్నప్పుడు నాలుగో తరగతి వరకు చదివాడట. యిప్పుడు వీరికి నలభైఐదు దాటాయనుకొంటాను. కొంచం కటాపిటగా కూల్లాతేమనిషి—

'రాగానే పాఠశాలలో గౌరవంగా కుర్చీమీద కూర్చోపెట్టాను. కూర్చున్న మహాశయుడు కూర్చోక, పక్కజేబులో నుంచి అరంగుళాల చుట్టతీసి వెలిగించాడు. అలవాటు ప్రకారం, మర్యాదగా నేను,

"బాబూ! బళ్ళో పొగత్రాగరాదండీ?" అన్నాను.

"ఏం! నువ్వు కాల్చటల్లా!"

"నేను బళ్ళో కాల్చడం లేదుకదండీ! కనీసం పిల్లలముందైనా కాల్చనే!"

"కాలిస్తే ఏం పోయిందయ్యా! అన్నీ రూల్సుగాని."

"ఎవరైనా ఆఫీసర్లు చూస్తే నా పరువు పోతుంది బాబూ!"

"అంత తెలివి తక్కువోడు ఎవుడు ఈ కాలంలో! అంతలోకే నలిపి పారెయ్యమేం?"

"ఆఫీసర్లు కాకపోయినా అసలు చదువంటే సరస్వతి గదా! అటువంటి సరస్వతి ముందు చుట్టలు కాల్చడం ఎంత పాపంటండీ! అంతే! మీలాంటివారు కొంచం కోపంలేకుండా మెల్లిగా ఆలోచించాలి. అసలు ఎవరైనా కాలుస్తుంటే మీబోటి పెద్దలు కాల్చకుండా ఆపుచేయాలి?..." అని కొంచం నమ్రతగా మాట్లాడాను.

ఇంత మాత్రానికే వీరభద్రయ్యగారు నిజంగా వీరభద్రావతారం ఎత్తారు!

"ఏం! నువ్వేనా పంతులువి? యిటువంటి పంతుళ్ళను సాలమందిని చూశా!" అని కుర్చీలో నుంచి లేచాడు.

"చూస్తే చూడొచ్చు బాబూ! కాని నేను మాట్లాడిందాంట్లో ఏం తప్పుందో చెప్పండి?"

"తప్పేంటయ్యా! మా ఆచార్లుగారి బళ్ళో కట్టాపోయినా ఏమనేవాడు కాదుగాని,మా నీతులు చెప్తాప్తన్నా వేంటయ్యా! మరీ .. మొవగాడిలా."

ఇంతలోనే ఇంకో పెద్దమనిషి ముల్లుగర్రతో పిల్లాణ్ణి బాదుకొంటూ లాక్కొచ్చాడు. వచ్చీ రావడంతోనే—

"ఏం పంతులువయ్యా నీవు? బళ్ళోకి పిలాడు వచ్చింది రాంది అంతే కనుక్కోవూ? నీకు గౌర్నమెంటు యిచ్చే డబ్బు ఎక్కువైం దట్టుందే! అన్నాడు."

నేను ఏదో సంజాయిషీ చెప్పబోయేసరికల్లా వీరభద్రయ్యగారు అందుకొన్నారు.

"గౌర్నమెంటు డబ్బిచ్చేదేంటి



సుబ్బయ్యా! అసలు మనూరొచ్చినోళ్లకల్లా తలదిరుగుద్దిలే! మనూరి నీళ్ళటువంటి యను కున్నవ్?"

"ఏంజరిగిందిరాయిూరబద్దరం?"అన్నాడు సుబ్బయ్య.

"ఏం జరిగిందేంటి? బళ్లోకే రాగూడ దంట! సుట్టలు కాల్చగూడదంట! మరీమరీ రూల్సు మాట్టాడతన్నాడు యిందాక ణ్ణుంచి"

"అంతదాక వచ్చిందీ! తస్సదియ్యా! మా పిల్లాడు యియ్యాల్టికి మూడురోజులు నుంచి బళ్లోకి రాలే! అంతేకనుకోక పోయె! బారెడు పొద్దెక్కాక బడిపెడతా డాయ్! గొడ్డాలకే వదుల్తాడాయ్! మళ్లీ మాపిటెంతల పొంటరకలుకట్టేఏలకు పెడ తాడు, గొడ్డు వూళ్లోకి రాకమునుపే వదు ల్తాడాయ్! ఏంసదువు — నా బొంద మీద సదువు"

అప్పటికి కొంచం జోక్యం కలిగించు కొని నేను "సుబ్బయ్యగారూ! మీ అబ్బా యికి యింకా పుస్తకాలే కొనిపెట్టలేదు! నన్ను ఏంచెప్పమంటారండీ"—అన్నాను.

"ఏంపుత్తకాలయ్యా! ఆ నరసిమ్మశతకం లేదు. అది చాలదేం? మాకొద్దు బాబు నీ జాగరఫీలు — చరిత్రలు. మాకెందుకు అరకదున్నుకొనేవాళ్లకి. మాకింత నోటు, పత్తరం, కొత్త వుత్తరం ముక్క, చన క్కాయ పద్దులు, యింతమాత్రం రాసు కుంటే చాలే!"

దీనికి ఏం జవాబు చెప్పాలో ఆలోచిస్తు న్నాను. ఇంతలోనే వీరభద్రంగారు అందు కొనే అందుకొన్నారు—

"ఏం సదువులే సుబ్బయ్యా! మన ఆచార్లుగారే బాగ చెపుతారు. తలోరూపా యేసుకొని, మళ్ళీ ఆయన్నే పెట్టుకొంటే బాగుంటది. మనక్కావలసిన రైతాంగపు చదువు చెప్తాడు. ఇదంతా డబ్బు లేనోళ్లకి — కిరస్తానోళ్లకిగాని, మన రైతాంగాని కేమాత్రం కుదురదు—"

ఇంతలోనే ఒకామె పిల్లాణ్ణి చేయి పట్టు కొని, లాక్కొచ్చి—

"ఏడి! ఆపంతులు! ఏంసదువయ్యా! పిల్లాళ్ళకి బయమే లేదాయ్! ఈడి పలక జూడు! ఎట్టపగలగొట్టుకున్నడో! కొని పది రోజులైనా కాదాయ్! మొద్దంటి పలక— ఆ ఆచార్లుగారు చెప్పేటప్పుడు ఇట్టనే చెప్పిండా! ఆయన్ని చూస్తే అందరు గజగజ వణికి నిదర్లోకూడా కలవరించేవోళ్ళు— ఈసదువేందో నా కర్దం గావటల్లా"—అని వుపన్యాసం మొదలుపెట్టింది—

ఇంతలోనే వీరభద్రంగారి వంత అందు కుంది.

"ఈబళ్లో పదేళ్లు సదివినా చనక్కాయ పద్దులైన యెయ్యలేరేనర్సమ్మక్కా! మనం పదిమందిం కలిసి మళ్ళీ తలా యింతేసుకొని ఆ ఆచార్లుగారినే పెట్టుకొందాం-ఎందుకు పిల్లాణ్ని తీసుకుపో! యెదవసదువు. యిది సదివినాఒకటే! మనం సదువుకోకపోయినా ఒకటే—"

"అయ్యో! కర్మమా. పిటీసన్లమీద పిటీ సన్లు రాసి తెప్పించుకొన్న సర్కారుబడికి యిటువంటి పంతుళ్ల నేశారేం-యిటువంటి మాయదారోళ్లకి సర్కారు సొమ్ము ఎట్ట వంటబట్టుద్దంట" అని మొదలు పెట్టింది నర్సమ్మగారు—

క్రొత్తగా బదిలీఅయిన మా సహోపా

## ★ కొత్తబడి ★

ధ్యాయుడు యీ వింత చూస్తూ తెల్లబోయి కూర్చున్నాడు. నేనేదన్నా సమాధాన మిద్దామన్నా మూడు రోకళ్లతో వక్లు దంచి నట్లు ముగ్గురూ ఉపన్యాసా లిస్తున్నారు.

ఇక కృతిమించి రాగాన పడుతున్నది. ఏమైతే అదే అవుతుందని, కొంచం దైర్య తెచ్చుకొన్నాను.

"బాబూ! మీమాటలే మీరుగాని, నా ప్రార్థన ఒకటి వినండి. ఇప్పుడు కాలం రోజుకు రోజా ఎలా మారిపోతోందో గమనించారా! చూడండి! దేశం ఏమూల చూచినా నాగరికత రోజుకు రోజు ఎలా మారిపోతోందో!"

"అందుకనే అయ్యా! రెండు చేతుల్తో బువ్వ తింటన్నాం—"అని వీరభద్రంగారు కళ్ళెర్రజేశారు!

"నామాట కొంచం వినండి బాబూ! ఈనాడు ఏదేశంలో ప్రజలు ఎలా జీవి స్తున్నారో! మనం అభివృద్ధిలోకి ఎలా రావాలో! దేశంలో ఎలా మసలుకోవాలో! ఏది మంచో, ఏది చెడో, తెలుసుకోవా లంటే, చదువుకంటె ముందు విజ్ఞానం అవ సరం—చూడండి! బంగారం వున్నదంటే దానిని రకరకాల సొమ్ములుగా తయారు చేయ్యొచ్చు. ఈ మాసిద్ధాంతం ప్రకారం పిల్ల లకు చదువు చెప్పామంటే ఒక శనక్కాయ పద్ధతే కాదు. ఏ లెక్కైనా, ఏ ఉత్తర మైనా, ఏ పేపరైనా, చదివి, అందరికి తెలిసేటట్లు చెప్పగలుగుతారు"అని కొంచం ఉపన్యాసధోరణిలో మాట్లాడాను. వీర భద్రంగారు ఎట్లున్నా మిగతా యిద్దరు కొంచం చల్లబడ్డారు. ఇది గ్రహించి "వీర భద్రయ్యగారూ! చూడండి. మీరు చిన్న ప్పుడు కొంతవరకు చదివారుకదా! ఇప్పుడు మీకు ఎంతవరకు జ్ఞాపక మున్నదండీ" అన్నాను.

"ఏం! నాయింటికి కావలసినవరకు నాకు బాగానే జ్ఞాపకం వుంది" అన్నాడు.

"అయితే చూడండి. యీ చిన్న లెఖ్ఖ చేసిపెట్టండీ. యిద్ద రన్నదమ్ములు. ఒక రూపాయిపంచుకొన్నారు. పంచుకోడంలో అన్నకు అణా ఎక్కువొచ్చింది. తమ్మునకు అణా తక్కువచ్చింది. చెప్పండి. ఇద్దరికీ ఎంతెంత వచ్చిందో?"

కొంచం ఆలోచించి "పెద్దోడికి తొమ్మి దణాలు, చిన్నోడికి ఏణ్ణాలు. యింతమాత్రం లెఖ్ఖ రాదనుకున్నావా!" అన్నాడు.

"కాంవడీ...అన్నాను.

"ఎట్టనయ్యా. చెరర్ధ పంచుకొంటే ఒకణా పెద్దోడికి నే ఆడికి తొమ్మిది, ఈడి కేడు. నన్నేదో మా డొంగు పుచ్చు తున్నావే—"అన్నాడు.

"అదికాదండీ. చూడండి. రూపాయిలో ముందు అణా పెద్దవాడికి యివ్వండి, ఇంకెంతుంది...పదిహేనణాలు. చెరిసగం పంచండి. చెరి ఏడణాలన్నర. పెద్దవాడికి అణా కలిసిందిగా! అంటే అతనికి అర్ధ రూపాయి అర్ధణా, చిన్నవాడికి ఏడణా లన్నర. అంతేనా! అణాయేగా ఎక్కు వచ్చింది! మీరు చెప్పిన లెక్క ప్రకారం చేడా ఎక్కువొచ్చింది" అన్నాను.

నివ్వెరపోయాడు పాపం! కొంచం తగ్గాడు. కాని ముఖాన్నిబట్టి చూస్తే! లోపల ఈర్ష్యతో మండుకుపోతున్నట్లు కనిపిస్తుంది. ఇది గ్రహించి, మళ్ళీ మొదలు పెట్టాను.

"చూడండి వీరభద్రయ్యగారూ! విజ్ఞాన మంటే ఒక్క లెఖ్ఖల్లోనే కాదు. ప్రతి దాంట్లో వుంటుంది. పూర్వం చదువుకు యిప్పటి చదువుకు గజమశకం తేడావుంది. అంటే పూర్వపుచదువు చెడ్డదనటల్లా? కాని పద్ధతులుమాత్రం వేరు. పూర్వం పంతుళ్లు పిల్లలను కొరడాలతో కొట్టేవాళ్లు. ఇప్పుడు చూడండి. ఆటలద్వారానే నేర్పమంటు న్నారు గవర్నమెంటు. మీరు నాయందు దయయుంచి, నే చెప్పినట్లు మీ పిల్లలకు పుస్తకాలు తెప్పించి శ్రద్ధగా చదివించండి. ఒక నెలలో నే గ్రహిస్తారు. తర్వాత మీపిల్లలు అభివృద్ధికి రాకపోతే మీ రన్నిమాటలన్నా పడతాను. ఎవరైనా మంచికోసం పాటుబడి మంచి అలవాట్లు, గౌరవం, మర్యాద, సంపాదించాలి" అని చెప్పేసరికి చల్లబడి మెల్లిగా బయలుదేరి వెళ్లారు.

మా అసిస్టెంటు టీచరు "హమ్మ!"... అని..."మాష్టారూ! ఈవూళ్ళో పిల్లలకంటే పెద్దలకే ట్రెయినింగు చేయాలండీ..." అన్నారు...

బుర్ర కెడెక్కి ఆలోచిస్తున్నా! ఇంత లోనే సైకిలుమీద మా పరీక్షాధికారి సురు గులు గ్రక్కుకుంటూ వచ్చారు. గౌరవ పూర్వకంగా స్వాగతంయిచ్చాము. కొంచం మంచినీళ్ల ఉపశమనం అయ్యాక...రికార్డు అంతా చూసి, "పిల్లలకు అన్నీ క్లాసు పుస్తకాలున్నాయా" అన్నారు.

నాకు నవ్వాలో — ఏడ్వాలో కూడా తెలియలేదు — అన్నీ చూసి ఇన్స్పెక్షన్ పుస్తకం పైకి తమకలాన్ని పోనిచ్చి,

"బడివసతి అనుకూలంగా లేదు, పిల్లలకు క్లాసుపుస్తకాలు లేవు..................." అని వ్రాశారు. టైంబెండి! బెల్ కొట్టాను. పిల్లలందరూ రాతిమీద కొట్టిన సీసా పెంకు లల్లే పరుగెత్తారు. పరీక్షాధికారికి పీకొక్క లిచ్చి, మేమిద్దరం బయలుదేరాం — ... మా రమణీయ స్వయంపాకసాధాలకు...★



# కొత్త కాపరం

శ్రీ వేకుమళ్ల కామేశ్వరరావు

ఆనందమూర్తి కళాశాలలో చదువుకొంటూన్న రోజులలో మధుర జీవితం గురించి కలలు కన్నాడు. జీవితమే ఆనందం, ప్రియాంగనయే మధుభాండం, సంసారమే అమృత సరోవరం అనే ఊహా లోకాన్ని సృష్టించుకొన్నాడు.

అతని చదువు పూర్తయింది.

తండ్రి చదువుకున్న చుక్కని చూసి కొడుక్కి ముడిపెట్టేడు.

ఆనందమూర్తికి రాజమహేంద్రవరం సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో గుమాస్తా ఉద్యోగం వచ్చింది. ఏదో ఒక అద్దె ఇల్లు చూశాడు. అందులో సామానులు పడవేశాడు.

లోలాక్షి కాపరానికి వచ్చింది. ఆమెకు ఆ ఇల్లు నచ్చలేదు. ఏవేవో కోరికలు కోరింది. అవెంతమట్టుకు సాధ్యమో ఆనందమూర్తికి తెలియలేదు. అయినా భార్యమాట ఎందుకు తీసివెయ్యాలని ఇంటికోసం వెతికేడు. కేటాయింపుగా ఉన్న వాటా ఒకటి దొరికింది. ఎంతో సంతోషం వేసు. అందులోకి మారేరు.

వారు సంసారం పెట్టి వారంరోజులయింది. ఇద్దరూ హోటలులో భోం చేసి వస్తున్నారు. ఆనందమూర్తికి అదేమీ అర్థం కాలేదు. ఆ విషయమై భార్యతో ఏమోస్తరుగా ప్రసంగం తేవాలో బోధపడలేదు. ఒకవైపు డబ్బుబాధ! మనస్సులో బాధ! మాటలు వాటంతటవే బైటపడ్డాయి.

లోలాక్షి "టిఫెన్ కారియర్ కొని తెండి. దానితో తెప్పించుకొందాం!" అంది.

నీటిలో నీడలు

ఫొటో: శ్రీ జి. యస్. భూషణ్



# ★ కొత్తకాపరం

అతను అందుబాటులో ఉన్న అల్యూమినియమ్ టిఫిన్ కారియర్ కొని తెచ్చేడు.

హోటలునుంచి టిఫిన్ కారియర్‌తో భోజనం యింటికి వస్తుంది. ఇద్దరూ విస్తరాకులు వేసుకొని భోంచేసి లేచిపోతారు. పనిమనిషి వచ్చినప్పుడు శుభ్రం చేస్తుంది.

ఒక నెల గడిచింది. ఆనందమూర్తి గడబిడ పడుతున్నాడు. ఏమీ తోచడం లేదు. సంసారం బాధగా పరిణమించింది. "నీకు వంటచెయ్యడం వచ్చా?" అని భార్యని మర్యాదగా ప్రశ్నించేడు.

'అదెట్లాగో! నేను చదువుకోలేదబ్బా! ఇంటర్‌లో ఆ సబ్జక్టే లేదు' అంది.

ఆ జవాబుతో అతను అణగారేడు.

పొద్దున్న టిఫిన్, మధ్యాహ్నం టిఫిన్ హోటేలునుంచి వస్తాయి.









లోలాక్షి పొద్దున్నే లేచి బొట్టుపెట్టె దగ్గర పెట్టుకొని జడ వేసుకొని, తలపిన్ను పెట్టుకొని, సబ్బుతో తోముకొని, మొహం పౌడర్ అద్దుకొని, లిప్ స్టిక్ పూసుకొంటుంది. ఇంటికి తమలపాకులు, పువ్వులు వాడుకగా వస్తాయి. ఆమె ఏదో పుస్తకం తీసుకొని కూర్చుంటుంది. ఇంతటిలో వార్తాపత్రికల కుర్రవాడు కిటికీలోంచి పత్రిక పడవేసి పోతాడు. దానిని ముందు పెట్టుకొని కూర్చుంటుంది. అంతటిలో ఫలహారం రాగా, పుచ్చుకొని ఆకులు పారవేసి, గ్లాసు పక్కని పడవేస్తుంది. మళ్ళీ పుస్తకం తీసుకొని కూర్చుంటుంది. అతను ఏమనగలడు? ఊరికే మథనపడతాడు. మాటలు పైకిరావు.

చదువుకొన్న ఇల్లాలు గృహాలంకరణం, అంటే గుమ్మం తెరలు, కొన్ని కొన్ని రకాల అల్లికలు అల్లగలదని అతను తలపోశాడు. కాని లోలాక్షికి వాటిని కళాశాలలో నేర్పలేదట! కాబట్టి రావు.

సాయంత్రం పూట ఇద్దరూ షికారు వెళ్ళడం లేదని లోలాక్షి గునిసేది.

కాని ఆ పేచీ ఉద్యోగమే తీర్చింది. అతను పొద్దుపోయిగాని ఆఫీసునుంచి ఇంటికి రాడు. ఒక్క ఆదివారమే అతని వశంలో ఉంది. ఆ రోజున ఇద్దరూ సినీమా చూడడానికి పోతారు. కాబట్టి షికారులు దూరమై పోయేయి.

'మీ కాపరం ఎట్లాగుందో తెలియజెయ్యవలసింది.' అంటూ తండ్రి ఉత్తరం రాశాడు. నిండుగా మునిగితే చలే లేదు అన్న సామెతప్రకారం ఆనందమూర్తి 'అంతా బాగానే ఉంది' అని సమాధానం రాశాడు. తండ్రి పరమ సంతోషపడ్డాడు

ఆనందమూర్తి ఇంటిదగ్గిర తన తల్లి కమ్మగాచేసి పెట్టగా తిన్న రోజులు స్మృతికి తెచ్చుకొని లొట్టలు వేశాడు.

లోలాక్షి బట్టల వెర్రి కొక మితమున్నట్టుగా అతనికి తోచలేదు. పైగా ఇప్పుడున్నవి చాలలేదు. ఆమె అతనితో బజారుకి వెళ్ళి మరికొన్ని గుడ్డలు - కొత్త కొత్త రకాలు - కొని తెచ్చుకొంది. వాటిలో తక్కువ ఖరీదుది ఒక్కటి లేదు. ఏమంటాడు? కళ్ళప్పగించి చూశాడు.

"ఈ సంసారంలో పొదుపు ఎలాగు? అదీ అతని సమస్య! "పోనీ నేను వంట చేసి చూడనా, పోతేపోయింది! పొద్దున్న లేచి ఆఫీసుకి వెళ్ళేదాక నేను పడేపాటు ఏముంది కనక! కాబట్టి వంట చేసి చూస్తాను!' అని నిర్ణయించుకొన్నాడు. కాని భార్యకి మాత్రం చెప్పలేదు. అడితికివెళ్ళి కట్టెలు, బొగ్గులు

[41 వ పేజీ చూడండి]

# ★ గోడమీద బొమ్మ ★

(19-వ పేజీ తరువాయి)

అదను దొరకడంతో గబగబ రంగయ్యగారింటివేపు నడిచాడు.

అప్పుడే వీధిదీపాలు వెలిగున్నాయి. తలుపు తట్టగానే తీసిన నరసమ్మ లోనికి వచ్చిన మేనల్లుని చూసి చీకటిలో ఒక్కసారి వెలిగి ఆరినజ్యోతిలా మనసైె గట్టిగా పట్టుకుని బొలబొలా ఏడ్చేస్తోంది. మనిషి చాల చిక్కిపోయినట్లనిపించిందామెకు. ఆ క్షణంలోనే వంటయింటి గుమ్మం దగ్గరకు వచ్చి చూస్తున్న పార్వతి కన్నీటితో లోనికి మళ్ళీ వెళ్ళిపోయింది. రామం కంటి రెప్పలు చెమ్మగిల్లి రానురాను కంటిలో నీరు అలముకొని రెండు కన్నీటి బిందువులు మేనత్తపైన వ్రాలాయి. మేడమీదనుంచి వాకిట నిల్చున్న మేనల్లుని చూచిన రంగయ్యగారు దగ్గుతూ, మూలుగుతూనే కర్రపూత చేసికుని మేడదిగారు. మావయ్యగారి పరిస్థితికి దిగులుగా చూస్తుంటే నరసమ్మ మేనల్లునివరండాలో మంచంమీద కూర్చోబెట్టింది. రంగయ్యగారు యెదురుగా స్తంభానికి ఆనుకుని కూర్చుంటూనే, "వచ్చావా బాబూ! ఆతండ్రి దయవల్ల అంతా క్షేమం కదా నాయనా!" ఆ మాటలు అంటూనే దగ్గారు. మంచానికి రెండోప్రక్క దిగువ నరసమ్మ కూర్చుంది.

రంగయ్యగారి ఆనందం మళ్ళీ మాటల్లో వ్యక్తమయింది. "అమ్మా! బాబు వచ్చాడే!" అంటూనే గట్టిగా పిలచి మళ్ళీ ప్రసన్నంగా, "నాయనా! ఏంటోరా—రాను రాను ఆకలి హెచ్చిపోతూంది. ఇంత ఆకలి ఒంటికి జబ్బేనురా! నామాటకేం గానీ - ఏంటో నీవు కనబడితే ఎంతో చెప్పుకుందామనుకున్నాను."

రామం యింతసేపూ ఒళ్ళంతా గుర్పాటు చెందటంవల్ల మాట్లాడలేకపోతున్నాడు. బాబు వచ్చాడన్నా చెల్లెలు యిటు వేపు కన్నెత్తి చూడలేకపోవటం మనసులో మరింత బాధగా వుంది. తను ఏమైతే చెప్దామని వచ్చాడో అది మరచిపోయాడు.

ముసలాయన మాట్లాడకుండా వుస్సు వుస్సుమంటున్నారు. కొంతసేటికి రామం తన ప్రయాణం సంగతి చెప్పాడు. ముసలాయన యింటిబాధ్యత తన మీద పడినందుకు సంతోషించి, "మంచిదే నాయనా!" అన్నారు. మరికొంతసేపటికి మేడమీదకు వెళ్ళిపోదామని లేచి వెస్తూతిరిగి; "నాయనా! ఎందుకైనా మంచిది. నీపైవిలాసం కోడలు చేతికిచ్చి మరీ వెళ్లు మరచిపోకు" అన్నారు.

రామం తర్వాత చెల్లెలువద్దకు వంటయింటికి వెళ్లేసరికి చెల్లెలు కళ్లు కప్పుకుని కూర్చుంది. అన్నయ్యరావటం గుర్తించి లేచింది. కన్నులు చిమ్మచీకట్లు కమ్మినట్లవటంచేత ఇద్దరిగొంతుకలు పెగలేదు. మూగివాళ్ళలా మనసులోనే మాట్లాడుకుంటున్నారు. అనుకోకుండా, "వస్తానమ్మా!" అన్నాడు. పార్వతి కళ్లెత్తి ఒకసారి చూసి దుఃఖాన్ని ఆపుకోటానికి ప్రయత్నిస్తూ; "ఇన్నాళ్లూ రాలేదేమన్నయ్యా!" "అబ్బే ఏమీలేదు - ఇప్పుడొచ్చానుగా!" పార్వతి చప్పున "అక్కడెలా వుంటున్నావన్నయ్యా!" అంటూ గొంతుక సరిచేసుకోపోయింది.

"బాగానే వుంటున్నానమ్మా! రేపు వూరికి వెళ్తున్నా ఎడ్రసు మామయ్యగారిమ్మన్నారు—'
అంటూ తిరిగివస్తూంటే పార్వతి వెనకనే వచ్చింది.

ఎడ్రసు వ్రాసి యిచ్చాక మేడమీదకు వెళ్లి మామయ్యగారివద్ద సెలవు తీసుకున్నాడు. ఆ గంభీరవిగ్రహంవేపు అదేంటో పదేపదే చూడాలని మనసు పుట్టింది. శెలవు తీసుకున్నాక గుమ్మం దాటాక, ఆగి మరీ చూచి అప్రయత్నంగా నమస్కరించాడు.

రామం వెళ్లిపోతున్నప్పుడు అత్తా కోడండ్రు గుమ్మంవరకూ సాగనంపారు. నరసమ్మ మేనల్లుని విడిచిపెట్టలేకపోయింది. పార్వతి తలదించి చీరకొంగుతో కన్నులు ఒత్తుకుంటోంది. ఇదంతా చూచి వ్యాకుల పడుతున్న మనిషి ఒక్క నిముషంపాటు మనస్సు మార్చుకుని ముందుకు కదిలిపోయాడు.

## 16

రామంవెళ్లిన రెండోరోజు సాయంత్రం రంగయ్యగారు దగ్గుతూ టెర్రస్ మీదకు చేసుకోడానికి వచ్చారు. దూరాన్నుంచి వెంకట్రావు న్యూస్ పేపరు చుట్టి చేపను తీసుకరావటం చూచారు. రంగయ్యగారు దగ్గరకువచ్చిన వెంకట్రావుని, "అదేం చేప నాయనా!" అని ప్రశ్నించారు. వెంకట్రావు చేపను చూపిస్తూ "ములవాడచేప. బాగా ముదిరింది లెండి. మీకు చాల యిష్టమని విన్నాను. కావలిస్తే ఉంచండి" అన్నాడు.

రంగయ్యగారు మెల్లగా మెట్లుదిగుతూ "తీసుకరా నాయనా!" అన్నారు. వంటయింటిదగ్గరకు వెళ్లి కోడలితో తన అభీష్టాన్ని చెప్పారు. "చేపకొయ్యటం అర్ధంగా జాగ్రత్తగా కొయ్యమ్మా! చిక్కటి చింతకాయ పులుసుపెట్టావంటే దానిమీద నున్న భ్రమపోతుంది!"

"దగ్గుతున్నారు!"

"అబ్బే! ఫరవాలేదమ్మా! మాంచి జ్వరంలో తిన్నా నాకేం చెయ్యదు!"

పార్వతి మారుమాట్లాడలేదు. ముసలాయన మేడమీదకు వెళ్లిపోయారు.

ఆరాత్రి భోజనం చేస్తూండగా కోడలితో "మరికొద్దిగా అన్నం, పులుసు వెయ్యమ్మా!" అన్నారు. పార్వతికి యిష్టం లేకపోయినా కొద్దిగా పులుసువేసింది. ముసలాయన తింటూ, "ఈ ఆకలి—ఎంతతిన్నా తినమంటుంది. అమితాకలి మంచిది కాదమ్మా ఒంటికి జబ్బే" అన్నారు.

పార్వతి జవాబుచెప్పలేదు, రంగయ్యగారు నెలరోజులనుంచి కడుపుపెద్దది చేసుకోవటం నిజంకాబట్టి.

రాత్రి పన్నెండుగంటలయింది. రంగయ్యగారు తప్పించి యింట్లో మిగతావాళ్లందరూ నిద్రపోతున్నారు. చలివేస్తున్నా రంగయ్యగారు గది తలుపులు మూయలేదు. కొద్దిసేపు గుండెలో కొద్దిగా గిలిగింతలు పెట్టినట్లవుతోంది. కష్టంమీద లేచి తలుపు చారవేశారు. మంచం మెల్లగా యెక్కి ఎడమప్రక్కకు తిరిగి పడుకున్నారు. నిద్ర పట్టలేదు. రానురాను మూలుగు ఆపుదామన్నా ఆపలేకపోతున్నారు. వికారం, గుండెబరువు రానురాను హెచ్చుతోంది.

గోడగడియారం ఒక్కొక్కగంట చొప్పున మూడుసార్లు కొట్టడం విన్నారు. తరువాత మోగన్ను నిద్ర పట్టినట్లయింది. ఎంతసేపోకాకుండానే, చప్పున మంచం దిగి, "అమ్మా అమ్మా" అంటూ రెండుకేకలు వేసి మంచం దంటె



# ★ గోడమీద బొమ్మ ★

పట్టుకుని తల మీదకెత్తి వూపిరి ఆడక పోవటంవల్ల తికమకపడుతున్నారు. పక్క గదినుంచి పార్వతి పరుగెత్తుకొచ్చి లైట్ వేసింది. మావగారు వూపిరాడక బ్రహ్మాండంగా గింజుకోవటం చూచి, "రండి! రండీ!" అని కేకలువేసింది. భద్రం ప్రక్క గదిన్నుంచి వచ్చాడు. "డాక్టరును పిలుచు కొస్తానుండు" అంటూ గబగబ మెట్లు దిగుతుంటే వీధితలుపు చప్పుడౌతోంది. తలుపు తీసేసరికి, వెంకట్రావు తొందరగా, "నే డాక్టరుదగ్గరకు పోతాలే. నివ్వు మంట వేసి నూనె గుండెమీద వ్రాసి కాచుతూండు" అని భద్రంతో చెప్పి వెళ్లిపోయాడు.

భద్రం తిరిగి మేడమెట్లెగబ్రాకేసరికి తండ్రి బాధ కళ్లారా చూశాడు. నరసమ్మ యింత కోలాహలమయ్యాక యిప్పుడు లేచింది. భద్రం సరుగుడు పుల్లలతో మంట చేశాడు. నూనెతో నరసమ్మ కాపడం చేస్తోంది. ఇంతలో డాక్టరు వచ్చి స్టెతస్కోపుతో గుండె పరీక్ష చేస్తూంటే, రంగయ్యగారు వద్దన్నట్లుగా తల వూపుతున్నారు. వెంకట్రావు డాక్టరు అచ్యుతరామయ్య చెవిలో యేదో చెప్పాడు. డాక్టరు వెంటనే సిరంజిలోనికి మందు యెక్కిస్తూంటే, ముసలాయన యేడవటానికి మొదలెట్టారు.

డాక్టరుకు ఇంజక్షను యివ్వడానికి వీలుగాని, అవకాశంగాని యివ్వక పోవటంతో మంటెత్తుకొచ్చింది. గబగబ వెళ్లిపోవటానికి సన్నద్ధుడవుతుంటె వెంకట్రావు డాక్టరును ఆపి, రంగయ్యగారితో గట్టిగా నచ్చచెప్పాడు. ముసలాయన తల మొత్తుకున్నారు. ఆయన జన్మలో ఇంజక్షను అంటే యెరగరు. వాటిమీద ఆ మందులమీద వారికి యెందుకో తీరని ద్వేషం వుంది. పార్వతి యెదురుగా నిలబడి కళ్లల్లో నీరు తెచ్చుకోవటం బాధపడుతూనే చూచాడు. మూగ భార్య యేడుస్తోంది. కొడుకు ముఖం ధుమధుమలాడుతోంది. కళ్లుగట్టిగా మూసుకుని దండ పైకెత్తారు. డాక్టరు ఇంజక్షను యిస్తున్నప్పుడు పళ్లు బిగబట్టి చచ్చినట్టు అయినారు.

"రేపు తిరిగి దర్శనం చేసుకుంటా" నంటూ డాక్టరు దిగువకు రాగానే వెంకట్రావు ఆయనను రిక్షా ఎక్కించి పంపించి తిరిగి మేడమీదకు వచ్చాడు.

రంగయ్యగారు కుర్చీ దగ్గరగా లాగి కూర్చునేసరికి మళ్లీ గుండెలో భారం హెచ్చయింది. చటుక్కున లేచి నిల్చుని, ఉండి ఉండి "రామ..." అంటున్నారు. వెంకట్రావు యీ పరిస్థితి అంతా చూచి, ఈ పెద్ద మంచం లాభం లేదని చిన్న మంచంవేసి ఒత్తుగా పరుపు వేయించాడు. రంగయ్యగారు పడుకోడానికి స్థిమితంలేక పరుపుకు చారబడ్డారు. కాని బాధఅమితంగా వున్నది. మంచందండె పట్టుకుని నిటారుగా నిల్చుని ముఖం పైకెత్తుకునే వున్నారు.

ఒకగంటసేపటికి కంటిరెప్పలు కొద్దిగా బరువెక్కుతున్నాయి. అందరినీ వెళిపోవలసినదిగా సైగచేశారు. అంతవరకు గదిబయట నిల్చుని చూస్తున్న భద్రం వెంటనే తనగదిలోనికి వెళ్లిపోయాడు. వెంకట్రావు వెళ్లిపోతూ, నాలుగుధైర్యమైన కబుర్లుచెప్పి, ఆ డాక్టరు శక్తిసామర్థ్యాలు చెప్పి మరీ క్రిందకు దిగాడు.

నరసమ్మ కోడలిని పోయి పడుకో మన్నట్లు సైగచేసింది. పరుపుమీద చారబడి మూలుగుతూ కళ్లుమూస్తున్న భర్తవైపు శోక నీరుతో చూస్తూ కాళ్లవైపు కూర్చుంది.

తెల్లవారకమునుపే రంగయ్యగారు లేచికూర్చుని దుప్పటికప్పుకునే చుట్టవెలిగించారు. కొడలు భార్య దగ్గరలోనే కూర్చునివున్నారు. కఫం బాగాచేయటం మూలాన్ని గొంతుకలో గురగుర లాడుతూంది. పార్వతి మూలపడివున్న పీకిదాన తీసికొనివచ్చి దగ్గరలో పెట్టింది.

ఇంతలో వెలుగు పూర్తిగావచ్చింది. చలి వేస్తోంది. పళ్లు తోముకుని వరండాలో యెండ కాస్తుంటే వచ్చికూర్చున్నారు. భద్రం కొట్టుకు యీరోజు మరీవేగంగా వెళిపోయాడు. మామూలుగా కిష్టయ్య వచ్చాడు. కాస్త ఎడంగా కూర్చుని వాడిపోయియున్న ఆ నరసమ్మ ముఖంవైపు చూచాడు. ఇంతలోనే వెంకట్రావువచ్చి, "ఏమండోయి! కిష్టయ్యగారూ!" అని పలకరించాడు. ఏమిరాపోయి ఏమండీవరకూ వచ్చిన యీ హేళనను పైకి చిన్న చిరునవ్వుతో స్వీకరించినా మనసులో మండిపడ్డాడు.

వెంకట్రావు వెంటనే రంగయ్యగారివైపు దృష్టి మరల్చి తన వాక్చాతుర్యాన్ని వినియోగించడం మొదలెట్టాడు. ఆ డాక్టరు మహా అఖండుడనీ మేటానుమేటని గొప్ప గర్విష్టనీ, ఇంద్రుడు చంద్రునివంటివారిని కూడ లక్ష్యపెట్టడని, అలాంటివాడు అంత రాత్రిమీద రావటం మన అదృష్టమని యింకొ తన అభిప్రాయములను ధారాళంగా యిస్తున్నాడు. జరిగిన విషయం అర్థంకాక కిష్టయ్య దిగువకు వెళ్లి పార్వతిని అసలు విషయమేమని అడిగాడు. పార్వతి జరిగినదంతా చెప్పింది. కిష్టయ్య విసుక్కుంటూ, "ఎ-ఎంతపని జరిగింది! వా-వాడికేం మే-మేర్చాణికి ఏమైనా ఇస్తాడు! ఆ చేప మా-మంచి వాళ్లే తి-తింటే జబ్బు చేస్తుంది!"

కిష్టయ్య "ఛాఛా యెంతపనైంద"ని విసుక్కుంటూనే, మేడమీదకు వెళ్లాడు. వెంకట్రావు పథ్యపానాదుల గూర్చి యేకదమ్మున లెక్చరు యిస్తుంటే కిష్టయ్య కొరకొర చూస్తున్నాడు.

రంగయ్యగారు చివరకన్నారు. "కాటికి కాళ్లుచాచుకున్నవాడికీ నిబంధనలన్నీ యెందుకు బాబూ?"

"మీ రలా అంటే ఎలాగునండీ? జగం మెచ్చిన పని చేసినవాళ్ల అవసరం అందరికీ వుంటుంది మీరలా అనుకుంటే మా అంద

రికి కష్టంగా వుంటుంది." ఈ మాటతో కిష్టయ్య చర్రున లేచి, "ఓహోహో! అ-అంత అభిమానం వున్నవాడివి ఆ-ఆముల వాడ చేప..." ఉద్రేకంతో మరి మాట్లాడ లేక పోయాడు.

వెంకట్రావు యీ మాటలను చులకనగా చిరునవ్వుతో తీసికుని, తల పంకిస్తూ రంగయ్యగారివైపు చూడకుండా, "ఎద్దుకేం తెలుసు అటుకుల్ల రుచి. మహారాజశ్రీ వారు రెండు రూపాయలిచ్చి జన్మలో అలాంటి చేప కొన్నారా అని? రంగయ్యగారి వైపు చూచి, "మీరు వెర్రివారై పుచ్చుకున్నారటండీ!"

రంగయ్యగారు చిన్న నవ్వుతో, ఆ కాలరులేని సగం చేతుల కమీజుతో ముఖం వాల్చుకొనుచు బాధపడుతున్న కిష్టయ్య వైపు చూశారు. తరువాత ప్రశాంతంగా,

"నాయనా! శాశ్వతమైన భూమిమీద అశాశ్వతమైన బ్రతుకురా మనది. ఈ బూడిదను యెవరు బొమ్మ చేశారో వారే మళ్లీ బూడిదచెయ్యాలి! అలాంటప్పుడు ఒకరిమీద విరుచుకుపడటం తప్పు కాదా?"

"కా-కాదు బాబూ! ఆ ఆచేపసంగతి చి-చిన్న పిల్లాడికి" ఇంతలో రంగయ్యగారు వాడిమాటలకు అడ్డి "అయితే నేను బ్రతకడం యిష్టంలేక అడిగితే, యిచ్చాడంటావా? పిచ్చివాడా! ఒకరిని యేమైనా యెందుకనవసరంగా అనాలి? నువ్వొకరిని చూడలేనప్పుడు నిన్నొకడు చూడగలడనుకోవటం పొరపాటు!" అన్నాడు.

అతికష్టంమీదనే యీ మాటలు ఆగిఆగి అన్నాక ఆయాసం కొద్దిగా వచ్చింది. ఇంతసేపు వెంకట్రావు కిష్టయ్యను మ్రింగివేసినట్లు చూచి శలవు తీసికుని వెళిపోతూ, కిష్టయ్యమీద విజృంభించాడు. "మాటలు చేతకాక పోతే మూగివాడిలా పడివుండుగానీ అసందర్భంగా పేలక! పెద్దమనిషి వుండిపోయారు కానీ యీనింద నా నెత్తిన రుద్దాలని పెట్టుకున్నందుకు చెప్పుతీసికుని కొట్టుదును."

కిష్టయ్య పళ్లు బిగించినా అతృతపడుతున్న ముసలాయన వంక చప్పున చూచి పెద్ద నిట్టూర్పు విడిచాడు. వెంకట్రావు మెట్లు దిగిపోయాడు.

ఎండధాటికి రంగయ్యగారు కొంచెం ప్రక్కకు సర్దుకున్నారు. కిష్టయ్య నెమ్మదిగా, "నేటివువైద్యం మీకు మంచిది. ఎ-ఎవరినైనా పిలుచుకొస్తా"నన్నాడు.

"నాయనా! కిష్టయ్యా! కాలం వస్తోందా? పోతోందా? ఆ రాముయ తండ్రి నాచివరిరోజులు——!" రంగయ్యగారి గొంతుక దుఃఖంతో కప్పబడింది. కళ్లలో కొద్దిగా నీరు తిరగటం గమనించిన కిష్టయ్య ఖిన్నుడయ్యాడు. ఈ గంభీరమైన విగ్రహం దూదితో చేయబడిందని తెలుసుకొని మనస్సులో మథన పడ్డాడు. కిష్టయ్య నోటివెంబడి మాటరాకముందే రంగయ్యగారు ఎడమ చెంప తడుముకుంటూ——

"ఒకప్పుడు ఎంతో గర్వపడేవాడిని! నాదీ ఒక బ్రతుకేనా నాయనా?"

మబ్బు దినకరుని కప్పివేయటంవల్ల రంగయ్యగారు చాటుగా వుంచుకున్న దుప్పటి తీశారు. కట్టుకున్న గావంచా తప్పించి శరీరంమీద మరేబట్టా లేదు. ఆ విశాలమైన వక్షం బాగా నల్లబడివుంది. వ్యక్తంచెయ్యలేని బాధతో గింజుకుంటున్న ఆ భారీ మనిషివేపు కిష్టయ్య మిటుకు మిటుకు మని చూస్తున్నాడు.

ఒక్కసారి వుప్పెనలా చలిగాలి వీచింది. దుప్పటి సర్దుకునేసరికి మళ్లీ యెండకాచింది. రంగయ్యగారు నెమ్మదిగా, "నాకేమి విచారం లేదు నాయనా!" అన్నారు. కిష్టయ్య అబ్బురంగా వింటున్నాడు. "కొడలికి యెవడూ అన్యాయం చేయలేడు. మద మాత్సర్యములున్నరారాజే కూలిపోయాడు. ఇక మా రామం! - వాడా!" ఉబికివస్తున్న అభిమానంతో రంగయ్యగారు మాట్లాడలేక పోయారు. కొద్దిక్షణాలు గడిచాక, "నాకాలం దగ్గరపడింది. నాయనా! జాతకరీత్యా యివే నా ఆఖరి రోజులు. అందుకే కదా వాడు తొందరలేనన్నా నిరుడు పెళ్లిచేశాను!"

తరువాత ముసలాయన మౌనంగా వుండటంచూచి కిష్టయ్యకు మనస్సులో వుండబట్టక, అయ్యోవాడు కొ-కొడుకుదా మ-మరి వాడిగురించియే-యేమీ చెప్పలేదేమని" అన్నాడు. రంగయ్యగారి ముఖం ముడుచుకుపోయింది. యెడమచంప తడుముకుంటూ "దేవుడిచ్చాడు. బ్రతకనీ!" ఈ ముఖభావం కిష్టయ్యకి నచ్చలేదు. లేచి నిల్చుని శలవు తీసికుంటూ, "సీతాలు చె-చెప్పింది లెండి. ఊ ఊరివాళ్లతోపాటు క-కన్నతండ్రి చెప్తంటే ఎలా?" కిష్టయ్య వెళ్లిపోయినా రంగయ్యగారి మెదడులో యీ సీతాలు యీ ప్రశ్నతో తిష్టవేసుకు కూర్చుంది. ★

ముక్కు మీద పెట్టుకొన్న కళ్లజోడు, కోసం వూరంతా వెదికినట్లు మన మంతా ఆనందం కోసం, అది వున్నచోటు తప్ప మిగతా సృష్టి అంతా వెదుకుతుంటాం.

—జోసెఫ్ బిల్లింగ్స్.



ఋతురాజు

ఫొటో: శ్రీ ఆర్. పి. రంగా

# బొమ్మరిల్లు

## సీతాకోక చిలుక - బాలుడు

శ్రీ జి. కోటయ్య

(జాతీయ రచనామండలి)

బాలుడు:—

రంగు రెక్కలదాన
రంగైనదాన
పూల తోటల్లోన
విహరించుదాన
తియ్యనీ తేనియలు
గ్రోలేటిదాన
ఆగవే ఒకచోట
మాట చెప్పెదను

సీతాకోక చిలుక:—

ఎవరవోయీ నీవు
ఎవరు నీవోయి?
పాఠశాలను విడచి
పాఠాలు విడిచి
ఏలనొచ్చావోయి
ఎందుకొచ్చావు?

బా:—కమ్మనీవాసనలు
గుమ్మరించేటి
పూలవనాలలో
పువ్వుకుంజాలలో
రంగు రెక్కల నీ
సింగారమును జూచి
నీతోడకలసినే
నాడవచ్చానే

సీ:—చాలోయిబాలుడా
చాలు చాలోయి.
కొంటె పిల్లలు బహు
తుంటరులు మీరు
మీకు మాకును నేస్త
మెన్నడును లేదోయి.

బా:—కొంటెవాడను కా
తుంటరిని కానె
చక్కనగు నీరూపు
జూచి వచ్చానె
పూలతోటల్లోన
పువ్వుకుంజాలలో
నీతోడ కలిసి నే
నాడవచ్చానే

సీ:—మంచి మాటలు జెప్పి
మా నేస్తమును బట్టి
మా రెక్కలను తుంచి
మా ప్రాణముల్ దీయు
మీకు మాకును నేస్త
మెన్నడును లేదోయి
పోవోయి బాలుడా
పో-పోవోయి పొమ్ము.





# జంతుకోటిలో మానవలక్షణాలు



(గత సంచిక తరువాయి)

బుద్ధి విశేషంలోనూ, మానసికోద్రేకాల విషయంలోనూ కూడా మనుషులకీ చింపాంజీలకీ చాలా సాన్నిహిత్యం వున్నది. అందుకనే మనుష్యుల తత్వం యింకా బాగా తెలుసుకొనేందుకుగానూ, కొంతమంది మానసిక తత్వశాస్త్రవేత్తలు చింపాంజీలపై పరిశోధనలు జరుపుతున్నారు. నిజానికి మానవుడిలో కనిపించే పైపై వికారాలు అన్నీ తీసివేస్తే చింపాంజీ తత్వం తయారౌతుందని చెప్పవచ్చు.

మన ఆడవాళ్లు నవమాసాలు మోస్తే, ఆడ చింపాంజీలు అష్టమాసాల్లోనే ప్రసవిస్తాయి. మొదటి బిడ్డను కన్న చింపాంజీ ఆబిడ్డను ఎత్తుకోలేక తానూ మహావుత్కృష్ట పడుతుంది; ఆబిడ్డనీ వుత్కృష్ట పెట్టేస్తుంది. ఎత్తుకోవటం సరిగా చేతకాక, బిడ్డ తలక్రిందికి వేలాడపడిపోయేలా పట్టుకొని యెత్తుకొంటుంది. బిడ్డ బొడ్డు పట్టుకు పైకెత్తుతుంది. ఈ అవస్థ అంతా మొదటి కాన్పుకే. ఆ తరువాత కాన్పులకు అలవాటు పడిపోతుంది. ఈమాదిరి అవస్థలన్నీ మనయిళ్లల్లో ఆడవాళ్లు పడుతూ వుండటం మనం చూస్తూవున్నదే కదా!

అడవిలో బ్రతికే చింపాంజీలన్నీ కూడా ప్రతిరోజూ రాత్రిపూట పడుకొనేందుకు చెట్టుకొమ్మల మీదికి ఎక్కి అదొకరకమైన గూడు తయారు చేసుకొంటాయి. అదే మళ్ళీ జూ్యలల్లో పుట్టి పెరిగిన చింపాంజీలైతే గూడు కట్టుకోవాలన్న ప్రయత్నమైనా చేయకుండా బ్రతికి పోగలవు. పక్షుల విషయం అల్లా కాదు. యదేచ్ఛగా బ్రతకనీయకుండా మన యిళ్లలో తెచ్చి పడేసుకొన్న పిట్టలకి పిల్లలు పుట్టితే, అవి కూడా అవకాశం రాగానే గూడు కట్టుకోవటానికి ప్రయత్నం చేస్తాయి అంటే వాటికి గూడు కట్టుకోవటమనేది పుట్టుకతో వచ్చే గుణం. చింపాంజీలకు అల్లాకాదు. అది, అవసర మొచ్చినప్పుడు మాత్రమే ఏ చింపాంజీకి ఆచింపాంజీ స్వతంత్రంగా తెలివితేటలు వుపయోగించి చేసేపని. ఈ ఒక్క విషయాన్ని బట్టే, చింపాంజీకి తెలివి తేటలు జాస్తి అని మనం అర్థం చేసుకోవచ్చు. పిట్టలకి గూళ్లు కట్టుకోవటం పుట్టుకతో వచ్చే గుణమైనట్లుగానే మనుష్యులకి కూడా యిళ్లు కట్టుకోవటం పుట్టుకతోనే చేతనైతే ఎంత బాగుండును!

ఏడాది దాటని పసిపిల్లలకీ ఏడాదిలోపువుండే చింపాంజీ పిల్లలకీ చాలా పోలికలు వుంటాయి. ఆతరువాత మాత్రం మనుష్యుల పిల్లల తెలివితేటలు చకచకా పెరిగిపోతాయి.

కోపతాపాలు, సుఖ దుఃఖాలు అనుభవించటంలో చింపాంజీమానవుడిని పోలివుంటుంది. వెనుక ఒకరి యింట్లో, ఒక చింపాంజీ పెరుగుతూ వుండేది. ఆయింట్లో దీన్ని కట్టేసిన చోటికి ఎదురుగుండా చాలా లావుపాటి 'ఆయా' ఒకామె వంటచేస్తూ వుండేది. ఈ చింపాంజీకి ఆవిడకేసి చూస్తుంటే, ఏమాదిరి ఆలోచనలు వచ్చేవో మనకు తెలియదు కానీ,

# ★ జంతుకోటిలో మానవలక్షణాలు ★

ఒకరోజు ఎందుకనో ఆయింటి యజమాని హఠాత్తుగా వచ్చి వంటయింటి తలుపు మూసేసరికి ఆ లావాటి ఆవిడ దానికి కనిపించకుండా పోయింది; ఇక దానికి పట్టరాని కోపం వచ్చేసి, ఆ గృహయజమానిమీద పడి కరిచేసింది.

తోటి కోతులతోనూ, వాటితోపాటు మనుష్యులతో కూడాను చింపాంజీలు సావాసంగా వుండగలవు. (ఒక్కొక్కప్పుడు ఎందుకోగానీ-కొన్ని చింపాంజీలు తోటి కోతులకంటే ఎక్కువగా మానవుల సావాసాన్నే అభిలషిస్తాయి కూడాను.) మనుష్యులకిమల్లేనే చింపాంజీలకి కూడా ఎల్లప్పుడు తమ విషయం మరొకరు పట్టించుకు పొగుడుతూవుంటేనే తృప్తిగా వుంటుంది.

జూల్లో మామూలుగా జంతువులను చూడటానికి వచ్చే మనుష్యుల దృష్టిని తమ వైపుకే ఎక్కువగా ఆకర్షించుకోవాలని అక్కడ బోనుల్లో వుండే చింపాంజీ నీళ్లు పుక్కిలించి వుమ్మెయటం, అర్థం లేని అభినయం ఏదో చేయటం, యిలాంటి పనులు ఎన్నో చేస్తుంటాయి.

'బ్రాన్జ్ జూ'అనే ఒకజూలో ఒకచింపాంజీ వుండేది. ఇది జంతువులను చూడవచ్చేవారి నందరి దృష్టిని తాను ఆకట్టుకోవటం కోసం బోనులోవుండే బక్కెట్టు దఢేలుమని క్రింద పడేసేది; చప్పట్లుచరిచేది; చేతులు వూపేది. పళ్లు యికిలించేది. ఇదంతా చూసి ఎవరో కొద్దిమంది దాని బోను దగ్గర చేరేవారు. నలుగురు ఒకచోట నిలబడి చూస్తూవుంటే మిగిలిన వాళ్లు కూడా అప్రయత్నంగా అక్కడ చేరిపోవటం మన మెరిగిన దౌర్బల్యమేకదా! ఐదు నిముషాలలో దాని బోను చుట్టూ బోలెడంతమంది మనుష్యులు చేరిపోయేవారు. అప్పుడు వాళ్లందరికీ వీలైనంత దగ్గరగా బోనులోనే జరిగి ముందుకు వచ్చి, యీ చింపాంజీ కాసేపు నాలిక బయటకు పెట్టి ఎవరినో ఒకరిని వెక్కిరించేది. జనం గొల్లుననవ్వటం మొదలెట్టాక, బోను యినపవూచల సందుల్లోనుంచి ఒకచెయ్యి యివతలకు చాచేది - తినుబండారాల కోసం! ఎవరైనా మహారాజు దయదలచి దానిచేతిలో అరటిపండు ఒకటి పడేస్తే, అంతటితో వేడుక చాలించేసి, ఒకమూలకు పోయి కూర్చొని పండు వలుచుకు తింటూ మళ్ళీ అందరికేసి ఒకసారి చూసి కృతజ్ఞతాసూచకంగా నవ్వేది.

వేడుకలు వినోదాలు అంటే మనకు ఎంత సరదాయో, చింపాంజీలకీ అంత సరదా వుంటుంది. చింపాంజీ పిల్లలు నిద్రపోతున్న వాటితండ్రుల పొట్టలమీదికి దభాలున దూకేసి హడలగొట్టుతుంటాయి. వాటి అబ్బలకి మాత్రం యీమాదిరి 'కోతి చేష్టలు' గిట్టక, అవి కోపగించుకొంటూ వుంటాయి.

ఒక జంతుపరిశోధన శాలలో ఒకనాటి రాత్రి వున్నట్లుండి ఎలక్ట్రిక్ లైట్లు అన్నీ ఆరిపోయాయి. ఆ పరిశోధనశాల అధికారులు లైట్లు ఎవరు ఆర్పేశారో తెలుసుకోవాలని అంతా కలియ తిరిగారు. తీరా చూస్తే, 'జోజో'అనే పేరుగల చింపాంజీయే యీపని చేసిందని తేలింది. దాని బోనుకు కొంచెం అవతలగా మెయిన్‌స్విచ్ వున్నది. ఈ'జోజో' ఎక్కడిదో ఒక కర్రముక్క సంపాదించి, దాంతో స్విచ్ నొక్కేసి, తీరా ఆకాపలావాళ్లు వచ్చే సమయానికి అటుతిరిగి నిల్చొని, నోటికి అడ్డంగా చెయ్యి పెట్టుకొని, పైకి పొంగివస్తున్న నవ్వు ఆపుకోవటానికి తంటాలు పడుతున్నదట.

మనం ఎంత బిగ్గరగా నవ్వగలమో, జంతు జాతిలో మనసోదర తుల్యులైన యీ చింపాంజీలు కూడా అంత బాగానూ నవ్వగలవు. అంతేకాదు మనలాగే ఏడవను కూడా ఏడవగలవు. కాకపోతే కొంటె పిల్లలకి మల్లే, వీటికి ఎంత ఏడ్చినా కంటి వెంట ఒక్కచుక్కైనా నీళ్లు రాలవు మనలాగే అవీ ప్రేమ పుట్టుకొస్తే కౌగలించుకోనూగలవు; ముద్దుల వర్షం కురిపించనూ కలవు. మన అందరిలా కాకపోయినా, కొందరిలా అయినా యివి బాధపడేవారిపట్ల మిను మిక్కిలి అయిన సానుభూతిని చూపగలవు. ఇంత జాలిగుండె కలిగి వుండటం ఒకొక్కప్పుడు దీని కొంపమీదికి ముప్పు తెచ్చిపెట్టుతూ వుంటుంది. చెట్టు కొమ్మ ఎక్కి కూర్చున్న ఒక చింపాంజీనిపట్టుకోవ

టానికి అనేక రకాల వ్యర్థ ప్రయత్నాలు చేసిన ఒక గడుసు మనిషి, క్రిందపడి చేయి విరగ్గొట్టుకొన్నట్లు నటించటం మొదలుపెట్టాడు. అవతల ఆమనిషి అంత బాధ పడిపోతూ వుంటే, తాను చెట్టుకొమ్మ లెక్కి కూర్చుని చూడలేక, ఆ చింపాంజీ గబగబా చెట్టుదిగి దగ్గరకు వచ్చేసింది. ఇంకేముందీ- పట్టుపడిపోయింది.

చింపాంజీలతో కొన్ని పరిశోధనలు చేసిన ఒక శాస్త్రవేత్త చిత్రమైన తన అనుభవం ఒకటి చెప్పాడు. తల్లీ పిల్ల చింపాజీలు వున్న ఒకబోను దగ్గిరికి యితడు తన కుర్చీని లాక్కొని కూర్చోబోయాడట. తల్లి చింపాంజీ తన బిడ్డను ఎత్తుకొని బోనులో ఒక మూలకు పోయి అక్కడ బిడ్డను గుండెకు హత్తుకు కూర్చొని, యితనికేసి బిత్తరచూపులు చూస్తూ వుండిపోయిందట. ఈశాస్త్రవేత్తకు చింపాంజీ చీకటిలో వున్నందువల్ల సరిగా కనిపించకపోగా అతడు తన కుర్చీని యింకా కొంచెం బోనుకు దగ్గిరగా జరుపుకోబోయాడట. కుర్చీతాలూకు పేడు ఒకటి యితని వేలులో గుచ్చుకుపోయింది. ఇతను బాధపడుతూ తన వేలివంక చూసుకొంటూ వుండగా, యిదంతా చూసిన ఆతల్లి చింపాంజీ పిల్లను అక్కడ పడేసి, ముందుకు వచ్చి, బోను పూచల సందుల్లోనుంచీ తన చెయ్యి యివతలకు పెట్టి, గాయపడిన ఆయన వేలిని పట్టుకుపోయి తననోట్లో పెట్టుకొని కాసేపు చప్పరించింది. ఆతరువాత బయటకు తీసి అతి జాగ్రత్తగా చూసి ఆపేడు బయటకు లాగేసిందట!

వైద్యపరీక్షలు చేసేటప్పుడు యించుమించు ప్రతి చింపాంజీ కూడా చాలా బుద్ధిగా మసులుకొంటుంది. వీటికి ముఖ్యంగా జబ్బు ఏదైనా చేసినప్పుడు వాటికి వైద్యం చేయవచ్చే మనుష్యులపట్ల అతి భక్తిభావం కనబరుస్తాయి. "వైద్యో నారాయణో హరిః; ఔషధం జాహ్నవీ తోయం" అన్న ఆర్యోక్తిలో వీటికి వున్నంత నమ్మకం మనకు కూడా వుండదేమోనని పిస్తుంది.

పూర్వం ఒకసారి ఒక చింపాంజీ పంటి పోటితో బాధపడుతున్నట్లు తన కాపలా వాళ్లకు వ్యక్తపరిచింది. వాళ్లు వైద్యుణ్ణి పిలిపించారు. వచ్చిన వైద్యుడు ఏకయ్యాళిమీద వున్నాడో, దీనినోరు తెరిపించి, అన్ని పళ్లూ చూసినట్లే చూసి చక్కాపోబోయాడు. వెనక్కి తిరిగిన వైద్యుడి చెయ్యి పట్టుకు గుంజి, యీ చింపాంజీ, తన నోటిని పగలదీసి వేలుపెట్టి ఏమూల తనకు బాధగా వుందో చూపెట్టింది. తీరా పరీక్షగా చూస్తే, దవడకి ఆఖరదానికొక కొత్త పన్ను వస్తోంది.

మన పిల్లలకి వచ్చినట్లే చింపాంజీ పిల్లలకీ పాలపళ్లు వస్తాయి. ఇలాంటి పాలపళ్లు పెరిగిన ఒక చింపాజీ పిల్లకు, వాటిలో ఒకటి ఒక దశలో కదిలిపోయి, దాన్ని చాలా బాధపెట్టేసింది. ఆపిల్ల చింపాంజీతోపాటుగా అదే జూలో వున్న చింపాంజీలన్నీ దానిచుట్టూ చేరి, దానిబాధకు ఎంతో సానుభూతి చూపాయి. దానినోరు తెరిపించి ప్రతి చింపాంజీ ఆ కదిలే పంటిని వూడలాగాలని చాలా ప్రయత్నం చేశాయి. కానీ పన్ను వూడి రాలేదు. ఇదంతా చూసిన కాపలా వాడొక ఏపు పటకారు ఒకటి బోనులోకి విసిరేశాడు. ఆ పటకారు పుచ్చుకొని ఒక పెద్ద చింపాంజీ నింపాదిగా ఆ పంటిని పీకేసింది. ఊడివచ్చిన పన్నును ప్రతి కోతీ పరీక్షగా చూసి, విసుగ్గా కింద విసిరేశాయి.

జ్ఞాపకశక్తి వుండటం కూడా తెలివితేటలున్నాయనటానికి ఒక నిదర్శనం. చింపాంజీలు ప్రతి విషయాన్నీ బాగా జ్ఞాపకం పెట్టుకోగలవు. ముఖ్యంగా వాటికేదైనా కోపంవస్తే మనుష్యులను యివి బాగా జ్ఞాపకం పెట్టుకొని, ఆమనిషి మరిచిపోయాక అయినా సరే, అతనిమీద పగతీర్చుకొంటాయి.

(ఇంకావుంది)



**కుమారి మాలతి:**

డా॥ యస్. వి. టి. చారిగారి కుమార్తె, మైలాపూరు రసికరంజనీ సభలో ఫిబ్రవరి 25 వ తేదీని ప్రదర్శన మిచ్చింది

# పోయిన పెన్

## పిల్లల నాటిక

శ్రీ కొమ్మూరి
శ్యామలరావు

పాత్రలు

మధుమూర్తి (పదేళ్ల అబ్బాయి)
రాంబాబు (అతని స్నేహితుడు)
కేశవరావుగారు (రాంబాబునాన్న)
సీతమ్మ (రాంబాబు తల్లి)
కాంతమ్మ (మధుతల్లి)

(కాంతమ్మ గారి యింట్లో ఒక గది. మధు పుస్తకము చదువుతూ వుంటాడు. చీపురుకట్ట పుచ్చుకొని కాంతమ్మగారు ప్రవేశిస్తుంది)

కాంతమ్మ: ఛీ ఛీ ఛీ! ఎప్పుడూ సర్దుతూ నే వున్నా యీ యింట్లో ఏమూలలో ఒకమూల చెత్త పోగడుతూ నే వున్నదామె!... ఈమధుగాడొకడు! ఇల్లంతా నాశనం చేస్తున్నాడు మరీను.

మధు: అను, అను; అనమ్మా నీయిష్టం వచ్చినట్లు అను!

(సీతమ్మ ప్రవేశిస్తుంది)

కాంతమ్మ: సీతమ్మగారా? అలా కూర్చోండి! (చాప చూపిస్తుంది)

సీత: (కోపంగా, కూచోటానికి కాదండీ వచ్చింది.

కాంత: ఏమిటో కోపంగా మాట్లాడుతున్నారేం?

సీత: మా కోపమెంత? మేమెంత లెండి? మేమేదన్నా తప్పుగానే తోస్తుందామె—మీలాంటి గొప్పవారికి!

కాంత: అదేమిటండీ? మేమిప్పుడు ఏం చేశాం?

సీత: ఏం చేశారో మీమధునే అడగండి- తెలుస్తుంది! [మధువంక చూస్తూ] అలా నంగనాచిలాగ చూస్తావేం, నాయనా, ఏమి తెలియనట్లు?

మధు: [బిక్క మొహంవేసి] నే నేం చేశానండీ యిప్పుడు?

సీత: అబ్బా! ఏం తెలియదేం పాపం! మా అబ్బాయి పెన్ను దొంగిలించి పట్టుకొచ్చి, పైగా ఏం తెలియదుట- తెలియదు!

మధు: నేనా? మీ అబ్బాయి పెన్నా? ఎత్తుకొచ్చానా???

సీత: ఆహా? అలా తెలియనట్లు నటిస్తావేం? నిన్న సాయంత్రం నువ్వు మాయింటికి వచ్చేదాకా అది డ్రాయరులోనే వున్నది. రాత్రి చూస్తే కనపడలేదు. నువ్వు తీయకపోతే ఏమైపోయినట్లు?

కాంత: ఏమండోయి, సీతమ్మగారు! మీరు కొంచం యిదిగా మాట్లాడుతున్నారు. మాఅబ్బాయి అటువంటివాడు కాదు, తెలుసా?

సీత: అవునవును; మీ అబ్బాయిని గురించి మీరు అల్లా కాకపోతే ఏమని చెప్పకొంటారు? ఇంతకీ - అతని జేబులో వున్న ఆపెన్ను చెప్పటం లేదూ - అసలు విషయం?

మధు: అది నాదీ! రాంబాబు పెన్ను చూసి బాగుందని, నేను కూడ కొనుక్కొన్నాను యిందాక.

సీత: కొనుక్కున్నావురా నాయనా! ఎంత నంగనాచివిరా?

కాంత: కొంచం జాగర్తగా మాట్లాడండి సీతమ్మగారు! ఇందకా వాళ్ళ నాన్నగారితో వెళ్లి కొనుకొచ్చుకొన్నాడు, పది రూపాయలు పెట్టి. రాత్రల్లా, మీ రాంబాబు కొనుక్కున్నలాంటి పెన్నే తనకీ కావాలని వీడు ఏడిస్తే ఆయన కొనిచ్చారు.

సీత: అబద్దాలకేం లెండి? ఆడిన కొద్దీ వస్తాయి! ఇంతకీ యీ వెధవ పెన్నుతో మా పనులన్నీ ఆగిపోయాయా? కాని స్నేహంగా వుండి ఇటువంటి పాడుపనులు చేయటం నాకసహ్యం సుమండీ!

కాంత: మీరు కొంచెం పెచ్చుమీరి తిడుతున్నారు. అటువంటి పన్లు చెయ్యటానికి మేమేం గతిలేని వాళ్లం కాదు.

సీత. [కోపంగా] అనవసరంగా మాటలెందుకు లెండి! అసలింతకీ తప్పు మా వాడిది. ఆ మధుతో



#  పోయిన పెన్ 

స్నేహం చేయద్దురా అంటే విన్నాడూ? ఇప్పుడు కుదిరింది తిక్క.

కాంత: పదిమాట లెందుకు సీతమ్మగారు; మీ కంతగా అను మానముంటే అల్లాంటిది యింకో ముష్టిపెన్ను కొనిస్తాం లెండి!

సీత: ఎవడి క్కావాలి ముష్టి పెన్ను? మీవాడినే వుంచుకో మనండి (రుసరుస లాడుకొంటూ వెళ్లిపోతుంది)

కాంత: దిక్కుమాలిన వెధవా! ఆ రాంబాబుతో స్నేహం చెయ్య వద్దంటే విన్నావా? ఇప్పటికైనా తెలిసిందా?

మధు: ఆ రాంబాబు మంచివాడే నమ్మా; వాళ్ళమ్మే గయ్యాళిది!

కాంత: ఏడిశావు; నీమూలాన నాపరువుగూడ పోయింది! ఈసారి వాడితో తిరుగు చెప్తాను-కాళ్లు విరుగ కొడతాను-తెలిసిందా?

మధు: [బిక్క మొహంతో] వాడేం చేశాడమ్మా?

కాంత: నోర్మూయ్ చవటా!

(తెర)

2 వ రంగం

[కేశవరావుగారిల్లు సీతమ్మ ఏదో పని చేసుకొంటు వుంటుంది. రాం బాబు జాలిగా ఒకమూల కూర్చొని వుంటాడు]

రాంబాబు: అమ్మా, నాపెన్ను!

సీత: అనుభవించు వెధవ! అడ్డమైన వాళ్ళనీ యింట్లో చేర నీయవద్దని ఎన్నిమార్లో చెప్పినా మాటలతో వింటావా? అందుకనే తగినశాస్తి జరిగింది: ఆఘోరించు!

రాంబాబు: ఊ! మధు అలాంటి వాడు కాదమ్మా మరి...

సీత: నీకు తెలుసు! అయితే ఆపెన్నెలాగ పోయింది?

రాం: ఏమో! వాడు మాత్రం అటువంటి పనులు చేయడమ్మా! నే నంటే వాడికి ఎంతో యిష్టం.

సీత: ఏడిశావులే! అటువంటి వాళ్ల మనస్సులో ఎంతలేసి ఆలోచనలు వుంటాయో నీకేం తెలుసు?

రాం: [కొంచెం ఆగి] అమ్మా! మధు రాకపోతే నాకు తోచదే అమ్మా!

సీత: ఆ మాట వద్దన్నానా? వాడేం దిగివచ్చాడా! ఇవాళ నుంచి వాడిపేరు ఎత్తు చెప్తాను-గూబలు పిండేస్తాను.

[మధు కంగారుగా వస్తాడు]

సీత: ఎందుకు నాయనా మళ్ళీ

(39-వ పేజీ చూడండి)

# డ్రాయింగ్ క్లాసు

శ్రీ మంధా లక్ష్మణరావు

ఆ వేళ శుక్రవారం. మాకు ఫస్టు పిరిడు డ్రాయింగ్. మేము 'స్కూల్ ఫైనల్' కనక, మాకు డ్రాయింగ్ అంటే అట్టే పట్టింపు లేదు. సెకెండ్ బెల్లు కొట్టారు. డ్రాయింగ్ మాస్టారొచ్చారు. బోర్డుమీద బొమ్మ వేస్తున్నారు.

మాలో కొందరు 'హోమ్‌వర్కు' లెక్కలు చేసుకుంటున్నారు. మరి కొందరు 'ఇంగ్లీష్ నాన్డిటైల్డ్' చదువుతున్నారు. కొంత మంది చుక్కలాట ఆడుకుంటున్నారు. ఇంకా ఏమీతోచని వాళ్ళందరూ చివరి బెంచీ మీదకు పోయి మెల్లగా బాతాఖానీ మొదలెట్టారు. నాదృష్టి మాత్రం ఎదురుగుండా వున్న ఇంజనీరింగ్ రూమ్‌కేసి మళ్ళింది.

ఇంజనీరింగ్ మాస్టారా వేళ రాలేదు. అందుచేత కొందరు ఎదురుగుండానున్న కాఫీ హోటల్లోకి, మరి కొంతమంది సోడా త్రాగడానికి, ఇంకా కొంత మంది ధూమపానానికి వెళ్లిపోయారు. ఈ అలవాట్లేవీ లేనీ శర్మ, సత్యన్నారాయణ మాత్రం రూమ్‌లో వున్నారు. ఆరూమ్‌లో ఓమూలనున్న ఇనపగుండు శర్మ దృష్టిలో పడ్డది. శర్మ ఆగుండుని పైకెత్తడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తున్నాడు. కాని కొంచెం కూడా కదపలేక పోయాడు. ఇది చూసిన సత్యన్నారాయణ వాడ్ని ఏడిపిద్దామని, "దాన్నే ఎత్తలేక పోతున్నావేంటిరా? ఇలాతీసుకురా; నే నెత్తుతాను" అన్నాడు. (వాడెలాగూ తీసుకరా లేడు గదా అని)

ఇది గ్రహించిన శర్మ "వివేకా

(40-వ పేజీ చూడండి)



"బావా వకకథ రాసిపెట్టవూ?" అని మారాం చేశాడు మా బావమరది.

"నాకు కథలు రావురా బాబూ" అని యెంత గోలపెట్టినా వింటేనా! వాడొక పెంకి వెధవ.

"పోనీలెండి; పిల్లవాడు అంతగా అడుగుతుంటే ఒక్క కథ రాయరాదు?" అని సలహాయిచ్చింది మా అర్ధాంగి.

"నరేలే! మహా పెద్ద సలహాలియ్యటానికి వచ్చేవు. నువ్వు రాయరాదూ నాకు చెప్పకపోతే? ఏ భక్త విజయములోనన్నా కాపీకొట్టి రాయలేక పోయావా?" అన్నాను నవ్వుతూ.

నిజంగానే నాకు కథలు రాయటం చేతగాదు. అసలు చదవటం అంటేనే నాకు కిట్టదే? కథలెల్లా రాసేదీ!...రాయక తప్ప లేదు' ఎల్లా వ్రాయటం-అదే పెద్దసమస్య యిప్పుడు.

చివరికి ఎల్లాగైతే నేం-మొదలు పెట్టాను, తాపీగా, కుర్చీలో కూచుని. "అనగా అనగా" అని రాస్తున్నా.

"అదేంటి బావా? 'అనగా అనగా'—అట్లాంటి కథలు నాకు వద్దు. మంచికథ రాయ్!" అన్నాడు శనిగాడికి మల్లే పక్కనే కూచుని నా బావమరది.

ఆవాక్యం కొట్టేసి మళ్లీ వ్రాశాను "బృందావనంలో గోపాల కృష్ణుడు..." అని.

"అబ్బే అదేం కథ బావా? అట్లాంటి పురాణ కథలు మా హిష్టరీలో చదివాలే! మంచివి రాయాలిగాని"...అన్నాడు వాడు.

నాకు నవ్వు వచ్చింది అల్లాంటి కథలు సైన్సులో చదివావన లేదు; వాడిపుణ్యమా అంటూ!

మళ్ళీ మొదలు పెట్టాను. "అది శరద్రాత్రి. ఆకాశంలో చంద్రుడు చరచరా పరుగెత్తుతున్నాడు..."

[illegible]

"ఎక్కడికి బావా చరచరా పరుగెత్తిపోయేది?" మళ్ళీ అడ్డు తగిలాడు. నాకు వొళ్లు మండుకొచ్చింది.

"అరే శకునపక్షీ! నువ్వు ఇక్కడినుంచి కదులు. ఏదో పాపం గదా అని కథ రాసిపెట్టుంటే, మధ్య యీ ప్రశ్న లేమిటి?" అన్నాను కోపంగా.

మావాడు యేరంధి నున్నాడో "నరే నేను పోతున్నాలే కానీ మంచికథ రాయాలి తెలుసా?" అని లేచి చక్కాపోయాడు.

సిగిరెట్టు ముట్టించి దమ్ము లాగుతూ ఆలోచించా. "రామాపురం అగ్రహారంలో మాధవరావు అనే బ్రాహ్మణ యువకుడు వున్నాడు. అతను B. A. మొదటి సంవత్సరములోనే లక్ష్మి అనే అమ్మాయిని ప్రేమించి పెండ్లి చేసుకొన్నాడు. మాధవరావుకు..."

"పోస్టుసార్" అని కేక వినిపించింది. 'వీడి తస్సాదియ్యా ఇప్పుడే దాపురించాడు, వీడు కూడా' అని విసుక్కొంటూ కాగితాలు అక్కడే పడేసి వెళ్ళి, వుత్తరం తీసుకున్నాను. మాయింటి యెదురుగుండా వున్న కిళ్ళీ కొట్టుకి వెళ్లి ఒక సిగిరెట్టు పాకెట్టు తీసుకుని వచ్చి కూర్చున్నా.

కథ యెంతవరకు అయిందో మొదటినుంచి చదివి చూతునుకదా అని మళ్ళీ 'మాధవరావుకు'; అన్నంత వరకూ నాదస్తూరీయే. దానిపక్కనే యింకొకరి దస్తూరీ వుంది - 'మంచి పెసరగారెలంటే మహాయిష్టం' అని! నాకు వొళ్ళు మండింది.

"లక్ష్మి" అని గావు కేకవేశాను లక్ష్మి వచ్చింది-నవ్వుతూ!

"ఏమటీ యీపిచ్చి పిచ్చి వేషాలు ఇది కథా, కాకరకాయా? నీయిష్టం వచ్చినందంతా యిందులో రాసేస్తే ఎలాగను కొన్నావ్?" చెంపదెబ్బ పెట్టినంత యిదిగా అడిగేశాను.

"అదేమి కథండీ, పిల్లలకి యివేమి అర్థమవుతాయండీ? ప్రేమ, పెండ్లి, యీగొడవ అంతా



వాళ్ళకెందుకు చెప్పండి?- ఏదో పేదరాశి పెద్దమ్మ కథలు రాయక!" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

లక్ష్మి చెప్పినమాట, నిజమేనని పించింది. అవును-యా ప్రేమ పెళ్లి గొడవలు పిల్లల కెందుకూ? పేదరాశి పెద్దమ్మకథ రాద్దామను కొన్నాను. ఆలోచిస్తూ కూచున్నా. ఎంత ఆలోచిస్తే మటుకు లోపల ఏమున్నా నరుకుంటేగా - రాయటానికి! కలం అలానే వుండి పోయింది, కాగితం మీద.

ఎలాగైతే నేం-మూడు గంటలు ఆలోచించి మూడు పేజీలు పూర్తి చేశా. ఈ లోపల మా వాడు పద మూడుసార్లు వచ్చాడు "అయిందా బాబా?" అంటూ.

"అరే! మీ అక్కయ్యను పిల వరా-కథ చదువుతాను" అన్నాను చదవటం మొదలుపెట్టాను. నేను చదువుతున్నంత సేపూ, మా ఆవిడ నగలపడి నవ్వుతోంది. ఆనవ్వు చూసి, నేను కల్పించి రాసిన కథ అంత బాగావుంది కాబోలు అనుకుంటూ, కథ చదవటం పూర్తి చేశాను.

నవ్వు ఆపుకోలేక "అరేయ్! మీ బావ, పాపం! ఇంత కష్టపడి రాసి అలిసిపోయారల్లే వుంది. కాసిని కాఫీ నీళ్ళు తీసుకోమని చెప్పరా" అంటూ, కాఫీ కప్పు అందించింది.

"ఇదేనా నువ్వు రాసింది ఇందాకటిబట్టీ? ఇది రాత్రి అక్కయ్య చెప్పిన కథేగా! ఇది మా 'సానీ' వ్రాసి పత్రిక్కు యిదివరకే పంపించాడు." అన్నాడు మావాడు. నా మొఖంలో నెత్తురుచుక్క లేదంటే నమ్మండి!

"అరె! మీ బావ మూడు గంటలు కష్టపడి రాస్తే అల్లా అనేస్తావేమిరా? పాపం సొంతంగానే రాశారు కాబోలు" అంది వెక్కిరిస్తూ వాళ్ళ అక్కయ్య.

"బాగ్లే ఊరుకో" అన్నా మొఖం కందగడ్డలా పెట్టి. "ఇంకొద్దులే బాబా" అన్నాడు మా వాడు సముదాయింపుగా.

"అరె! మీ బావ సొంతంగా రాస్తాడురా. భక్తవిజయంలో కథ లెందుకు కాపీ చేస్తాడు?" అంటూ వుంటుంది దాగాళిగా లక్ష్మి ఇప్పటికీ. నాకు ఒళ్ళు మండేది. కాని ఏమి చేయను? "ఓస్ నేను రాయలేకనా? నీతమ్ముడు కథలు రాయమని అడగండే నే నెందుకు రాస్తాను? కాకపోయినా-వాడు ఇక ఎప్పుడు నన్ను కథ వ్రాయమని వేధించకుండా చేయటం కోసమే అల్లా రాశాను, అప్పుడు" అని సమాధించుకున్నాను.

# ★ పోయిన పెన్ ★

(35-వ పేజీతరువాయి)

వచ్చావు - ఇంకా మాకళ్లు కప్పి యేమైనా ఎత్తుకు పోదామనా?

మధు: అది కాదండీ...

సీత: ఏదికాదూ? నీతో మాకేమిటి గానీ, మర్యాదగా బయటకు దయచెయ్యి బంగారు నాయనా?

మధు: అది కాదండి! మీపెన్ను వున్నదండీ [జేబులోనుంచి తీసి యిస్తాడు]

సీత: అదీ! నేను చెప్పలా? నువ్వేగా తీసింది? మాట్లాడ వేం??

మధు: (సిగ్గుతో తలవంచుకొని)...ఊ...

రాం: నువ్వేనా నిజంగా తీసింది? అలా ఎందుకు చేశావురా?

మధు: [నెమ్మదిగా] ఊరికనే తీశానురా!... మళ్లీ యిచ్చేశాగా? నాతో సావాసంగా వుంటావా?

సీత: ఇంకా ఎందుకులే నాయనా, యీపాడు సావాసాలు! ఇప్పటికి జరిగింది చాలు: వెళ్లు బాబూ, వెళ్లు!

రాం: [రహస్యంగా) మా అమ్మతో ఏమిటిగానీ, ఆడుకుందాములే! ఇప్పటికి ఇంటికి వెళ్లు! ఊ?...

---

"మీ సమర్థన బాగుందండీ" అంది మా ఆవిడ నవ్వుతూ. ఏది యెలావున్నా అప్పటినుండి నన్ను కథ రాయమని మావాడు అడగడం మానేశాడు. నాకూ, ఆ బెడద తప్పింది. 'అప్పుడు అనుకున్నాను-కీడులో కూడా మేలు వుంటుందని!



మధు: సరే [వెళ్ళిపోతాడు]

సీత: తియ్యలేదుట-తియ్యలేదు! వాళ్ళమ్మ తెగ నీలిగిందే? అబ్బాయిగారి బండారం ఇప్పుడు బయట పడింది!!

రాం: పాపం మధు ఎంత మంచి వాడో చూశావా అమ్మా? పొరపాటున పెన్ను తీసివుంటాడు. మళ్ళీ తెచ్చి యిచ్చేశాడు.

సీత: ఏడిశినట్లే వుంది నీ మంచితనము, వాడి మంచితనము. నేను నాలుగూ అనేసరికి హడలిపోయి యిచ్చేశాడు గానీ లేకపోతే ఇచ్చేవాడా? అమ్మో!

[కేశవరావుగారు ప్రవేశిస్తారు]

కేశ: ఏమిటే, ఎవరు హడలి పోయారంటున్నావు?

సీత. మీ రెక్కడ కెప్పుడు తారో అని యిప్పటివరకు చెప్ప లేదు. మనఅబ్బాయి పెన్ను నిన్న పోయింది!

కేశ: పోయిందా?

సీత: భయపడకండి! మరెక్కడికీ పోలేదు. ఆ మధు గాడు దొంగిలించి తీసుకుపోయాడు. నేను వెళ్ళి బెదిరించగానే భయపడి తెచ్చి ఇచ్చేశాడు.

కేశ: ఏడిశినట్లే వున్నది! పెన్ను పోవట మేమిటి? ఇదిగో నాకోటు జేబులో వుంటేను! [జేబులోంచి తీసి] ఇదిగో.

సీత: అరే! ఎక్కడిదీ?

కేశ: ఎక్కడిదేమిటి నీ మొహం? నిన్నపనుండి ఆఫీసుకు తీసుకు పోయాను. ఇంట్లో చెప్పటం మరిచి పోయాను.

సీత: పాపం - ఆ అబ్బాయి చెప్పింది నిజమే నన్నమాట! అలాంటి పెన్నే తనుకూడ కొనుక్కున్నా నన్నాడు.

కేశ. అప్పుడే పనిగట్టుకు వెళ్ళి వాళ్ళతో దెబ్బలాడి వచ్చావన్నమాట!

సీత: నాకేం తెలుసండి? ఇదంతా చేసింది మీరేనాయే! ఒరే రాంబాబూ-పోయి మధుని తీసుకురా! పెన్ను ఎందుకు ఇచ్చేశాడో కనుక్కుందాం!

[రాంబాబు పోతాడు]

3 వ రంగం

[రాంబాబు మధుతో వస్తాడు]

సీత: [మధు చేతికి పెన్ను ఇచ్చివేస్తూ] ఈ పెన్ను ఎవరిది నాయనా? భయంలేదు నిజం చెప్పు!

మధు: అది మీదేగా?

సీత: లేదు! మా పెన్ను దొరికింది!! ఎవరిదీ పెన్ను? పర్వాలేదులే చెప్పమ్మా!

మధు: [నిమ్మదిగా] అది నాదేనండి.

సీత: [తెల్లబోయి] మరయితే-దొంగిలించానని అబద్ధం చెప్పి, మాకెందుకు ఇచ్చేశావు?

మధు: మ్మీ రేమో-అది నేనే కాజేశానని దెబ్బలాడేరు కదండి! రాంబాబు కూడా అలానే అనుకొని, నాతో సావాసం మానేస్తాడేమోనని నేను కొనుక్కొన్న పెన్ను తెచ్చి, మీకు ఇచ్చేశానండి.

సీత: [జాలిగా] ఎంత అమాయకుడివిరా పిచ్చి తండ్రీ.

మధు: మరి నాతో ఆడుకునేటందుకు వస్తావా రాంబాబు?

# ★ డ్రాయింగు క్లాసు ★

(౩౩-వ పేజీ తరువాయి)

నందం గాడ్ని తీసికొస్తాను వుండు. వాడు ఈ ఇనుపగుండును నీ దగ్గరకు తీసికొస్తానుడులే! అప్పుడు నువ్వు దాన్నెత్తుతావా?" అని అడిగాడు.

'ఎత్తుతా'నన్నాడు సత్యన్నారాయణ.

శర్మ వివేకానంద కోసం బయటికి వెళ్తున్నాడు.

వివేకానందం, శర్మ వచ్చే లోపుగా తానక్కడ్నించి ఉడాయిస్తే వాళ్ళొచ్చి 'స్టన్' ఐపోతారని అనుకొని సత్యన్నారాయణ రెండో గుమ్మంలోంచి పరుగెత్తబోయి బెంచీ తగిలి 'దభేల్' మని క్రిందపడి పోయాడు. ఈ చప్పుడు విని, పోతూ పోతూవున్న శర్మ వెనక్కి తిరిగొచ్చాడు.

సత్యన్నారాయణ, క్రింద పడి వున్నాడు. దెబ్బకు దెబ్బ తీయడానికి ఇదే సమయమనుకొని "అరె పడిపోయావా? ఇలారా లేవదీస్తాన"న్నాడు శర్మ.

ఇదంతా చూసిన నాకు నవ్వాగలేదు. ఫక్కున నవ్వేశాను. అంతే-వెంటనే నావీపుమీద వేడి వేడి స్పెషల్ పెసరట్టొకటి 'చుంయ్' మన్నది.

"ఎవ్రడా వాడు?" అంటూ వెనక్కి తిరిగి చూతును కదా-మా డ్రాయింగ్ మాస్టారు!

నేను క్లాసులో కూర్చున్నట్లు, సెకెండ్ బెల్లయిన తరువాత మాస్టారొచ్చినట్లు నాకు అప్పటికి బాగా జ్ఞాపకం, వొచ్చింది.

క్లాసంతా గొల్లున నవ్వుతున్నారు. నా గుండెలు అతి వేగంగా కొట్టు కుంటున్నాయి.

ఈ కోలాహల మంతా విని హెడ్మాష్టరుగారు ప్రళయ కాల రుద్రునివలె ప్రత్యక్షమయ్యారు. అందరూ లేచి నిలబడ్డారు. అంతా నిశ్శబ్దం. క్లాసులో మాస్టారుండడం చూసి హెడ్మాష్టరు గారు కాస్త చల్లబడి "ఎందుకలా నవ్వుతున్నారు?" అని ఒక ప్రశ్న విసిరారు.

డ్రాయింగ్ మాస్టారు అతి వినయంగా జవాబివ్వడం మొదలెట్టేరు. "నేను బోర్డుమీద బొమ్మ వేశానండి. వీడు బొమ్మను చూసి నవ్వేడండి. నేను వీపుమీద ఒక దెబ్బ వేశానండీ. వాడు......"

స్కూల్ ఫైనల్ స్టూడెంటుని గదండీ! అసలుగుట్టు బయటపడక ముందే ప్రారంభించాను—"నేను బొమ్మను చూసి నవ్వలేదండీ" అని, ఇంజనీరింగ్ రూమ్‌లో జరిగినదంతా చెప్పాను. ఇది విని హెడ్మాష్టరు గారు కూడా ఒక చిరునవ్వు నవ్వి "క్లాసులో అల్లరి చేయకండి. ఊ!" అని వెనక్కి తిరిగి వెళ్లిపోయారు. ★

## పోయిన పెన్

సీత : పోయిరండి నాయనా! బంగారు కొండల్లా ఇద్దరూ ఆడుకోండి!

[ఇద్దరు వెళ్ళిపోతారు]

సీత: పాపం వాళ్ల మధు ఎంత మంచివాడండీ!

కేశ: చూశావా, చిన్న పిల్లల మనస్సులు ఎంత లేతగా వుంటాయో? తమస్నేహం ఎక్కడ పోతుందోనని తన పెన్నే ఇచ్చేశాడు!... వెంటనే ఆ కాంతమ్మగారి యింటికి పోయి క్షమాపణలు చెప్పుకో.

సీత: [సిగ్గుతో] అలాగే.

[తెర] 

# ★ కొత్తకాపరం ★

(24-వ పేజీ తరువాయి)

తెచ్చేడు. బజారుకి వెళ్లి బియ్యం, పప్పులు, ఉప్పులు, కూర నార మితంగా కొని తెచ్చేడు. పెట్టెలోంచి గిన్నెలుతీసి ఇవతల పెట్టేడు. లోలాక్షి చిత్రంగా చూసి 'ఏమిటీ పని ?' అని అడిగింది.

'వంట ప్రయత్నం !'

'అది మీకు సాధ్యమా !' అని ఆశ్చర్యపోయింది.

'ఏమో, చేతయినంతమటుకే చేస్తాను !"

"మీకు వస్తుందేమోకాని నాకు అసలే రాదబ్బా !' అంది.

అతను ఎంతో శ్రమపడ్డాడు. వంట అంత సులువుగా అయేపని కాదని తెలుసుకొన్నాడు. పైగా ముందు ఎన్ని అమర్చుకొంటే గిన్నె పొయ్యిమీదికి ఎక్కించడం! విసుగెత్తింది, చిరాకు పుట్టింది.

వంటమాట ఎట్లాగున్నా, పోనీ కాఫీ ఫలహారాలేనా తయారు చేసుకొందామని కూరిసేడు. వాటికి అవసరమైన సరుకులు తీసుకువచ్చేడు. ఒక శేరు గోధుమలు మిల్లులో రవ్వగా పోయించేడు. దానిలో పొట్టు అంతా ఉంది. అది వేరుచేసే ఉపాయ మేమిటి ? తన తల్లి మిల్లులో పోయించినప్పుడెల్లా, చేటతో చెరిగి, పొట్టు, పిండి, సన్నరవ్వ, ముతకరవ్వ అని నాలుగు విధాలుగా తీసేది. ఆమె నేర్పును తలుచుకొని అతను విస్మయపడ్డాడు. కాని ప్రయోజనం శూన్యం !

ఆఖరికి కాఫీయేనా తయారు చేసుకొందామని ఆనందమూర్తి తహతహలాడేడు. నానావస్థలుపడి కుంపటి వెలిగించేడు. కళ్ళనీళ్లు తుడుచుకొన్నాడు.

భార్య అతన్నిచూసి జాలిపడి 'ఎందుకొచ్చినపాట్లు అవి !' అంది.

'కడుపుకోసం పడే తిప్పలు ! ఇది లేకపోతే ప్రాణమే ఉండేటట్లు కనబడదు !' అన్నాడు భర్త.

లోలాక్షి అతని శ్రమచూసి నొచ్చుకొని తనుకూడ శ్రమలో పాల్గొనదలిచింది.

కుంపటిమీద నీళ్లు కాగుతున్నాయి.

'ఆమె నేను కాఫీపొడిమీద నీళ్ళు పోస్తాను' అంది.

'సరే ! పొయ్యి !' అన్నాడు భర్త.

ఆమె పట్టుకారును గిన్నెకి తగిలించి ఒక చేతితో దింపబోయింది. సరిగా పట్టు దొరకనందున గిన్నె కిందపడింది. నీళ్లు అటుఇటు చిందేయి. ప్రమాదం తప్పింది!

'దేవుడికి నా మీద దయ పూర్తిగా ఉంది. కాకపోతే ఈ రోజు ఇట్లా గడిచేది కాదు' అని ఆనందమూర్తి ఆనందపడ్డాడు. అతను ఒకందుకు విపరీతంగా సంతోషించేడు. లోలాక్షి పనులు చేతగాక చెయ్యడం లేదుకాని చేస్తే నామోషీ అని కాదు. ఎగిరి ఆకాశాన్ని అందుకొన్నట్టుగా సంబరపడ్డాడు.

అతనికివచ్చే జీతం రాళ్ళు ఎందుకూ కాకుండా పోతున్నాయి. తండ్రికి డబ్బు పంపమనిరాస్తే 'నువ్వు వచ్చిన దానితోటే సరిపెట్టుకోవాలిరా అబ్బాయీ!' అని ముద్దు ముద్దుగా చీవాట్లు పెట్టేడు. ఆనందమూర్తి "జానపదకథలలో చెప్పే గిన్నె ఎక్కడైనా దొరికితే బాగుండును. అది బోర్లించి తియ్యగానే కోరిన వన్నీ సమకూడుతాయట ?' అని వ్యర్థంగా తలపోశాడు. స్నేహితులదగ్గిర అప్పు సప్పులు చేశాడు. అవి తీర్చేదారేమిటో కనబడదు. 'పొదుపు ; పొదుపు'! అని మొత్తుకొంటున్నాడు. 'మనశ్శాంతి ! మనశ్శాంతి!' అని కలవరిస్తున్నాడు.

లోలాక్షికి కూడ ఈరకం జీవితం నచ్చలేదు. పైగా ఆమెకు హోటేలు మెతుకులు సరిపడలేదు. సుస్తీ చేసింది. ఆసుపత్రినుంచి మందుతెచ్చి పెట్టడమొకటి ఆనందమూర్తికి అదనపు పని అయింది. ఆమె కూడ ఈబాధలనుండి విడివడితే బాగుండునని తలపోసింది. కాని దారేమిటి ?

అతను సాహసించి "మీ అమ్మగారు నీకు ఇంటిపనులు నేర్పలేదా ?" అని అడిగేడు.

"మీకు రానట్టే నా కూరావు. మీకు మీ అమ్మగారు నేర్పించేరా ఏమిటి చెప్పు దురూ ?" అని ఎదురు ప్రశ్నించింది.

'నేర్పిస్తే మనకీ పాట్లే లేకపోను. అది కాదు. అందరి ఆడవాళ్ళకి ఇవి వస్తాయి కదా అని నేనడగడం ?'

'పుట్టుకతోనే వస్తాయని కమోను మీ ఊహ !'

'కాదులే !' అని వేలు కరుచుకొని 'వంటయినా నేర్పనిదేరాదు' అని తనలో తను సమాధానం చెప్పుకొన్నాడు.

లోలాక్షి 'నేను చదువుకొన్న కాలేజి చదువులో అవి లేవు. ఇంటి దగ్గరఉన్నంత సేపూ చదువుతోటే సరిపోయేది కాబట్టి మా అమ్మ నేర్పలేదు. మరే లాగు వస్తుంది' అని ప్రశ్నించింది.

"అయితే లోటు మనది కాదన్నమాటే!

"ఎంతమాత్రమూ కాదు!"

'మరెవరిదో అయుంటాది !' అనుకొన్నాడు ఆనందమూర్తి. 'ఎవ్వరిదైనా నాకిప్పుడొరిగే లాభం రవ్వంతైనా లేదు' అని ఊరుకొన్నాడు.

రోజులు గడిచిపోతున్నాయి. కాని అతని శేమీ పాలుపోడం లేదు.

అతను వంటవిషయమై మరొకసారి గట్టి ప్రయత్నం చేద్దామనుకున్నాడు. భార్యతో కూడ ఆలోచించేడు. అన్నీ కూడ బజారునుంచి తేవలసిన సరుకులే కనబడ్డాయి! బియ్యం, అపర దినుసులు,—కట్టెలు, బొగ్గులు ఆలాగుండనియ్యండి—అప్పడాలు, వడియాలు, ఊరగాయలు, వడ్పల్లు, చారుపొడి, కూరపొడి, పులుసుపొడి, వీటికి తోడు లోలాక్షి జాష్లు, డబ్బా ఆహారాలు కూడ రానిచ్చింది. హోటేలునుంచి తెప్పించుకోడమే అతనికి చవకగా కనబడింది. 'వరహాల చెట్టొకటుంటే బాగుండును! మొదట దానికోసం తపస్సు చేసి తర్వాత సంసారం పెట్టుకొంటే బాగుండును! ఇది సంసారమా ? యమలోకమా ? సంసారమంటే ఇలా గుంటుందని ఇదివరకు ఊహించలేకపోయేను!' అని విచారించేడు. తల్లి కమ్మగా చేసిపెడుతూంటే తిన్న రోజులు జ్ఞాపకానికి వచ్చేయి. ఇప్పటి కర్మను తలుచుకొని దుఃఖించేడు. తన భార్య చేదడు నీళ్ళైనా తోడలేదు. పనిమనిషి తోడిపెడితే చెంబుతో తీసుకోనడమే అపురూపం! ఒకవంక నాజూకుతనం! మరొకవంక చేతకానితనం! అతనికి ఏమీ తోచలేదు. "మా తల్లిని రమ్మని టెలిగ్రాం ఇస్తున్నాను!" అన్నాడు లోలాక్షితో.

"అది మంచిపని! ఆవిడ వస్తే ఇంత ముద్దేనా వండిపడేస్తుంది మన ఇద్దరికీ!" అంది ఇల్లాలు.

తల్లిని ఇంటికి తీసుకురావడానికి ఆనందమూర్తి రైలుస్టేషన్‌కి వెళ్ళేడు. స్త్రీ సమాజంలో జరుగుతూన్న సభకి లోలాక్షి వెళ్ళింది. ★



# విజ్ఞానవీధులు

## "డాక్టర్"



## 99. సూర్యుడూ గ్రహాలూ గుండ్రంగా ఎందుకున్నాయీ?

సూర్యబింబము గుండ్రంగా వున్నట్టు ఉదయమూ సాయంకాలమూ గుర్తించవచ్చును. చంద్రబింబము నిండుగా కనబడినప్పుడు గుండ్రంగా వుంటుందని మనకి తెలుసును. గురుడూ, శనీ, అంగారకుడూ దూరదర్శినిలో చూస్తే గుండ్రంగానే వుంటాయి. ఇవి గోళాకారముగా ఎందుకున్నాయీ? అని ప్రశ్న.

సూర్యుడు వాయుగోళము. అందుకే ఫొటోగ్రాఫు తీస్తే అంచులు స్ఫుటంగా రావు. ద్రవంగా గాని ఘనపదార్థంగా గాని వుండి వుంటే అంచులు స్ఫుటంగానే వుండాలి. ఇక గోళకేంద్రము దగ్గరున్న వాయువులు గుత్తంగా ఘనపదార్థముకంటె సాంద్రంగా వుంటాయి. ఈవాయువులు సూర్యమండల లోపరిభాగము మీదనున్న వాయువుల్ని గట్టిగా లోపలివైపు లాగుతాయి. అన్నివైపులా సమాసాకర్షణము ఉండడము చేత అన్నివైపులా వాయువు సమంగా నొక్కబడి గోళాకారమౌతుంది. వాయువులలో కణము కణానికీ వున్న ఆకర్షణ తక్కువ. అందువల్ల ఒక చోట కుప్పపడినా అలాగే నిల్చిపోక సర్దుకుపోయి గోళమై పోతుంది.

గ్రహాలన్నీ సూర్యుడినుంచి విడిపోయి ఘనీభవించిన వాయువులవల్ల ఏర్పడ్డవే. వాయువులు ముందు ద్రవరూపముపొంది తర్వాత ఘనీభవిస్తాయి. గ్రహాల తొలి రూపాల్లో వుండిన వాయువులు వాటికేంద్రముల దగ్గర గుత్తంగా కూడి ఉష్ణోగ్రత తగ్గి చల్లబడి ద్రవాలైయుంటాయి. ద్రవాలన్నిటిమీదా సన్నని రబ్బరు పొరవంటి పొరవుంటుంది. నీటిమీద చెయ్యిపెట్టి నొక్కితే చేతికి తెలుస్తుంది ఈ పొర. సబ్బునీళ్లలో ఈ పొరశక్తి ఎక్కువ; అందుకే చీపురుపుల్ల సబ్బునీళ్ళలో ముంచి ఊదితే ఆగాలి సబ్బునీటి బిందువులోపలినుంచి పెరిగి సబ్బుబుడగ ఏర్పడుతుంది. పొర తన ఆకుంచనశక్తివల్ల కుంచించుకుపోతుంది. అంటే బుడగ ఉపరిభాగము తక్కువ వైశాల్యం పొందడానికి యత్నిస్తుంది. గ్రహాలు ద్రవీభవించినప్పుడు ఆ ద్రవము పొర తక్కువ వైశాల్యము పొందే యత్నంలో గుండ్రన అవుతుంది. ఒకే పరిమాణముగల ద్రవానికి గుండ్రంగా ఉన్నప్పుడే ఉపరితలముయొక్క వైశాల్యము కనీసమౌతుంది. కనక గ్రహముల ద్రవపదార్థము దాని ఉపరితలము కుంచించుకోడముతో కనీసపు ఉపరితల వైశాల్యముగల గోళరూపము పొందుతుంది. ఇటు తర్వాత చల్లారడములో ఆ గోళాకారము గోళాకారముగానే వుండిపోతుంది. అందుచేతనే గ్రహాలు గోళాకారముగా వున్నాయి.

సీసమును కరిగించి ఎత్తునుంచి సన్నని ధారగా నీటిలోపోస్తే, ఆ ధార చిన్నచిన్న బిందువులుగా తెగి, ప్రతీబిందువు తన ఉపరితల ఆకుంచనమువల్ల గుండ్రమై నీట్లోపడి చల్లారి గట్టిపడుతుంది. ఇలాగే తయారుచేస్తారు చిన్నచిన్న రవ్వల్లాంటి సీసపుగుళ్లు.

—రావు

## 100. సముద్ర తీరపు నూతులలో మంచినీరు

"సముద్రపు నీరు విపరీతమయిన ఉప్పదనముగా ఉన్ననూ, దానికి కొద్దిదూరములో గల చలమలనీరు తీపిగా ఎందుకు ఉంటుంది?" అని నిజామాబాద్ నించి వి. కేసరి భరద్వాజ్ గారు అడుగుతున్నారు.

అనేక యుగాలనుంచి వాననీరు నేలమీదా, నేలలోనూ ప్రవహించి సముద్రానికి చేరుతోంది. ఈ నీటితో కూడా దానిలో కరిగిన ఉప్పులు సముద్రపునీటిలో చేరుతున్నాయి. ఎండవేడివల్ల సముద్రములోని నీరు మాత్రము ఆవిరియై పైకి పోతూ ఉండడమువల్ల సముద్రపు నీటిలో ఉప్పులు దట్టమైపోయి కాలక్రమాన్న ఈనాటికి విపరీతమైన ఉప్పదనము వచ్చింది. సముద్రములో చేరే నీరు మామిమీద ప్రవహించే నదీజలముమాత్రమే కాదు. భూగర్భములో కూడా నదులలాగే నీటిప్రవాహము మట్టిద్వారా చిమ్మకుంటూ తక్కువ మట్టము వేపు ప్రవహిస్తూంటుంది. ఈ నీరు నదులవలెనే కొన్ని దారులలో ఎక్కువగా వుంటుంది. నూతులు తవ్వినప్పుడు పడే 'జలలు' ఈ నీరే. ప్రత్యేక శయ్యలలో నీరు ఎక్కువగా సాగుతూంటుంది కనక అన్నినూతులలోనూ నీరు ఒకేమట్టాన పడదు.

నదులు ఎండిపోయినా, చలమలు తీస్తే నదీ శయ్యలో నీరు పడుతుందని మనకి తెలుసు. ఈ నీరు భూగర్భములోని ఉపనదులు నదీశయ్య దిగువనవున్న అంతర్వాహినిలో చేరడమువల్ల కూడిన నీరు. ఇలాగే సముద్రతీరమునకు చేరువన నూతులు తీస్తే భూగర్భములో సముద్రమువైపు ప్రవహించే అంతర్వాహినుల తాలూకు నీరు ఆ నూతులకు అంది, ఈ నీరు తియ్యగా వుంటుంది. కాని ఒక్కసంగతి జ్ఞాపకముంచుకోవాలి. నదుల పక్కనవున్న ఊళ్ళలోని నూతులలో నీరు, నదికి వరదలు వచ్చినప్పుడు ఆ వరదల నీటిమట్టానికి లేస్తుంది. ఈ రీతిగా సముద్రము పక్కనవున్న నూతులలోని నీరు పాటుపోటులతో తగ్గుతూ హెచ్చుతూంటే ఆ నీరు సముద్రముతో సంబంధమున్న నీరు కనక తియ్యగా వుండదు. అలాకాక సముద్రతీరపు నూతుల నీరు సముద్ర జలపు మట్టంకంటే ఎత్తునవుంటే ఆ నీటికి సముద్ర జలస్పర్శ ఉండదు కనక తియ్యగా వుండగలదు. సముద్రతీరపు తియ్యనీటి నూతులు నూటికి నూరూ ఇలాంటివే. అంటే వాటి నీటిమట్టము సముద్రమట్టంకంటె ఎత్తున వుంటుంది. అయితే సముద్రమువైపు ప్రవహించేయకుండా, ఆ నూతులలో ఎలాగ నిలిచింది? అని అడుగుతారేమో? ఆ నీరు సముద్రమువేపు (మట్టిలోనుంచి) జారు

తూనే వుందీ, ఆ నూతులలోనికి ఎగువనుంచి నీరు చేరుతూనే వుంది. పెద్ద మోటలు పెట్టి తోడేస్తే ఆ నీరు అయిపోయి నూతి అడుగు కనిపించేస్తుందీ, రాత్రి అంతా నీరువూరి, మళ్లీ నుయ్యి నిండుతూనూ వుంటుంది. విశాఖపట్టణంలోని మంచినీటి నూతులలో ఈ చిత్రం చక్కగా కనబడుతుంది. వాటిలోని నీరు సింహాచలపు కొండలలోని నీరు సముద్రానికి చేరుతూన్న భూగర్భ నిర్ఝరమువల్ల నిండుతుందిట.

## [illegible]

—కొందరు పిల్లలు ఏడాది నాటికే నడవగలుగుతారు, కొందరు మూడేళ్లువచ్చేవరకూ నడవలేరు నిజమే. లేచి నిలబడడానికి నడుమూ, మోకాళ్లూ నిలబెట్టాలి. ఇందుకు నరాలూ కండరాలూ బలంగా వుండాలి. వీట్లో శక్తిలేని పిల్లలు త్వరగా నిలబడలేరు. ఇలాగ శక్తిలేకపోవడానికి ఆ పిల్లలు కడుపులో నున్నప్పుడు తల్లులకు జబ్బు చెయ్యడముగాని, ఆహారము సరియైనది పడకపోవడముగాని ముఖ్యకారణాలు.

—ఉల్కలు భూమి చుట్టూ కాదు తిరుగుతూండుట; సూర్యుని చుట్టూను. అవి భూమి గురుత్వాకర్షణ క్షేత్రములోనికి (అయస్కాంత క్షేత్రములోనికి కాదు) వచ్చినప్పుడు, దూరముగావున్న సూర్యుని ఆకర్షణకంటె, ఇప్పుడు దగ్గరైన భూమి ఆకర్షణము బలమై, ఉల్కలు భూమిమీద పడతాయి. సూర్యుడు భూమికంటె 12,95000 రెట్లు పెద్దగోళము. కనక భూమిమీద సూర్యుడి ఆకర్షణే ఎక్కువగా వుంటుంది. కాని భూమిసూర్యుడి చుట్టూ తిరగడమువల్ల (తాడుకి కట్టి తిప్పిన రాయికి లాగ) భూమికి తన కక్ష్యనించి తప్పుకుని పారిపోయే బలమువస్తుంది. సూర్యుడి ఆకర్షణబలమూ ఈ బలమూ సరిగ్గా సమానము. కనక భూమి అటుసూర్యుడివైపూ పోక, సూర్యుడికి వ్యతిరేక దిక్కులో దూరంగానూ పోక, తన కక్ష్యలోనే తిరుగుతుంది.

—తల్లి గర్భములో నున్న పిండము యొక్క బొడ్డు తాడుకొసని ఉన్నపొర, తల్లిగర్భమునకు లోపైపున అంతటా అంటిపెట్టుకుని వుంటుంది. ఈ పొరకీ బిడ్డకీ నడుమ ఒకద్రవముంటుంది. ఇది బిడ్డకి దెబ్బతగలకుండా కాపాడుతుంది. జననకాలములో ఈ సంచీ చిరిగిపోయి ఆద్రవము బిడ్డ పైకివచ్చేదారిని నిర్విఘ్నముగా చేస్తుంది. పిండము గర్భములో నున్నంత కాలమూ తల్లి నెత్తురే ఈ బొడ్డు తాడు ద్వారా పిండములోకూడా ప్రసరిస్తూ వుంటుంది. బిడ్డపుట్టడముతో ఈ తాడూ దానికొసని వున్న మావీ పడిపోతాయి. మంత్రసాని, ఈ తాడుని కొసనుంచి బిడ్డ బొడ్డుదాకా నొక్కిరాసి, ఈ తాడులో వున్న నెత్తురుని బిడ్డ శరీరములోకి తోసేసి, బొడ్డుకి దగ్గరగా ఈ తాడుని గట్టిగా తాడుతో కట్టి ఆ తాడుని కొంచెం పైకి కోసేస్తుంది. తాడు కట్టివుండడమువల్ల నెత్తురు చిమ్మదు. నాలుగైదురోజులకి బొడ్డుకి పైన వున్న ముక్కకి నెత్తురు సరఫరా చాలక అది వాడిపోయి పడిపోతుంది. కనక బొడ్డు ఉపయోగము మనకు తల్లి గర్భములో వున్నప్పుడే గాని, పుట్టిన తర్వాత ఏమీ లేదు రామన్నగారూ.

—అర్ధాంగి భాగము ఎడమభాగమే. అందుకే పెళ్ళిళ్లలో పెళ్ళికూతురుని పెళ్లికొడుకుకి ఎడమవైపు కూర్చోపెడతారు.

—చంద్రు డుదయించునప్పుడు సముద్రము మనమున్న చోట పొంగదు. చంద్రుడికి చేరువగా ఉన్నచోట పొంగుతుంది. అంటే చంద్రుడు నడినెత్తికి వచ్చినప్పుడు మనదగ్గిరనున్న సముద్రం పొంగుతుంది. చంద్రు డుదయించగానే సముద్రపు కెరటాలు — దూరంగా ఉన్నవి — అంతవరకూ కనబడనివి ఆ వెలుగుకి కనబడతాయి. అందుచేతనే చంద్రోదయంతో అవి బయలుదేరాయనుకోడానికి వీలిచ్చింది.

—కాస్మిక్ కిరణములు ఆకాశాంతరాళములలోనుంచి అన్నివైపులకూ ప్రసరించే 'కిరణాలు', ఇవి విద్యుదావేశితములైన కణములో, లేక అతిసూక్ష్మమైన నిడివిగల తరంగములో ఇంకా నిశ్చయము కాలేదు. భూమిమీదికి వచ్చేవి మాత్రము విద్యుదావేశితములగు కణములే అనడానికి సాక్ష్యముంది. కాని ఇవి మొదటినుంచీ కణములేనా? లేక తరంగములే అయి అతిపల్చగానున్న భూసమీప ద్రవ్యమును విచ్ఛిన్నము చేయుటవల్ల మధ్యని ఏర్పడ్డ కణములా అన్న సమస్య ఇంకా తేలలేదు. కణములు వెలుతురున్న వేగముతో ప్రసరించలేవు. కనక ఇవి తరంగములే అంటున్నారు కొందరు.

—తలను నిలబెట్టే నరముల బలహీనత వల్ల ముసలివారు తలను ఆడింతురు.

—మంచుగడ్డ వేసిన షర్బత్ గ్లాసుకి పైపైపున బిందువులు బిందులుగా, గాలిలో వున్న తేమ ఏర్పడడము మీరు చూచే వుంటారు. భూమి చల్లబడి, దానిమీద మొలిచే గడ్డి మొక్కమీద సరిగ్గా ఇలాగే మంచు 'కురుస్తుంది'. ఇది మన దేశపు కథ. శీతలదేశాల్లో మబ్బులో నీరు చల్లదనమువల్ల మంచు రేకలుగా మారి, సూరేకారపు పొడిలాగ రాలుతుంది. ఇదే మంచు కురవడమంటేను.







ప్రకాష్ ప్రొడక్షన్సువారి "కన్నతల్లి" తో జి. వరలక్ష్మి, మాష్టర్ బాబు.



మూడో పెళ్లి భార్య పార్వతిని ఆనంద బాష్పాలతో "దేవుడు నిను మేలుచేయుగాక" అని ఆశీర్వదిస్తున్నాడు భుజంగరావు

వినోదావారి "దేవదాసు" లో సావిత్రి, సి. యస్. ఆర్

# పుట్టిల్లు

రాజా ప్రొడక్షన్సువారి "పుట్టిల్లు" మొన్న 8 వ తేదీన భరణీ స్టూడియోలో పత్రికలవారికి చూపించబడింది. గతమాసం 19 వ తేదీన ఆంధ్రదేశంలో విడుదలచేయబడిన ఈ చిత్రంలో కొన్ని అంశాలపట్ల ప్రేక్షకులు తీవ్ర అసమ్మతి తెలిపారనీ, ఆ అంశాలను తొలగించి, కొన్ని దృశ్యాలు కొత్తగా షూట్ చేసి, రీఎడిట్ చేశామనీ నిర్మాతలు తెలిపారు. రీ ఎడిటెడ్ కాపీనే పత్రికలవారికి చూపించారు.

ముఖ్యంగా చిత్రం ఆఖరులో సుశీల ఆమెభర్తను క్షమించి స్వీకరించినట్లుగా మార్చబడిందని తెలుస్తున్నది. ఏమి మార్పులు చేసినా, ఈ చిత్రం ఎంతవరకూ ప్రజాదరం చూరగొంటుందనేది సందేహాస్పదమైన విషయమే. కారణం, ఎంత కష్టమూను పడినా కొట్టవచ్చేటట్లు కనిపించే లోపాలు చిత్రమంతటా విరివిగా కనిపించటమే. తెలుగు ప్రేక్షకులు టెక్నికల్ గా అభివృద్ధిచెందిన చిత్రాలను, ఏమున్నా లేకపోయినా టెక్నికల్ పరిణతికైనా కలిగినచిత్రాలను అనేకం చూశారు. తెలుగు చిత్రాలస్థాయిని మళ్లీ పౌరాణిక చిత్రాల రోజుల స్థాయికి తీసుకుపోయే "పుట్టిల్లు" చిత్రాన్ని ప్రేక్షకులు ఆదరించకపోతే ఆశ్చర్యపడనక్కరలేదు.

ఈ చిత్రం ఎందుకిట్లా తయారవ్వాలో అర్థంకాదు. నిర్మాత డా॥ రాజారావు గారికి మిగతా నిర్మాతలందరి కంటే అన్ని హంగులూ ఉన్నాయి. చిత్రనిర్మాణం ఆరంభించినది మొదలు పూర్తి చేసేవరకూ



తాను వలచిన గౌరి తననే నిరాకరిస్తున్నదని మోహనుకు పట్టరాని కోపం వచ్చింది. ఇంతలో తల్లి కూడా చూచిందేమోనని గాభరా మిళితమయ్యింది.

ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్సు వారి "పెంపుడు కొడుకు" (ఇదివరకటి పేరు 'కన్నకడుపు') లో కుమారి, గణేశన్.

## ★ పుట్టిల్లు ★

పత్రికలవారినుంచి ప్రతివారూ వీరి పట్ల ఆదరాభిమానాలు కలిగివున్నారు. దీనికి ముఖ్య కారణం ఈ ప్రొడక్షన్సువారి సౌజన్యం. వీరు తీసుకున్న కథలోని వస్తువుకూడా మంచి సాంఘిక సమస్యా చిత్రానికి ఆధారం కాగలిగిన వస్తువే. ఎటొచ్చీ తెలుగు చిత్రాలన్నిటిలోనూ అంతో ఇంతో కనిపించే లోపాలే ఈ చిత్రంలో జుగుప్సాకరమైన పరిమాణంలో, విస్తృతంగా కనిపిస్తాయి.

కథలో ఒక సమస్యకు కాదు, అనేక సమస్యలకు తావివ్వటంతో ఏ సమస్యకూ న్యాయం జరక్కుండా పోయింది. ఆడపిల్లల చదువు సమస్య ఒకటి. సుశీల సమర్తాడే వరకూ చదువుకోటానికి అభ్యంతరం చూపని తండ్రి, పైగా ఆమె చదువులో ఎంతో ఆసక్తి కనబరచిన తండ్రి, ఆ తరవాత తీవ్రంగా అభ్యంతరం చెబుతాడు. ఆ అభ్యంతరానికి డబ్బుపెట్టి చదివించలేకపోవటమనే కారణంకూడా లేదు. వంశగౌరవానికి మచ్చ అనే కారణంతో చదువు మానిపిస్తాడు. ఈ రోజుల్లో ఈ కారణంతో ఆడపిల్లల చదువు మాన్పించేవారు నూటికొకరిద్దరైనా కన్పిస్తారో లేదో. అందుచేత ఇది సాంఘిక సమస్యగా పరిగణించవలసినంత ప్రధానమైనది కానేకాదు. ఆర్థిక కారణాలవల్లగాని, పెద్ద చదువులు చదివినా మగవారికే ఉద్యోగాలు దొరకని రోజుల్లో ఆడవారికి ఎక్కడ దొరుకుతాయనే భయంతోగాని చదువుకోని స్త్రీలు అనేకమంది ఉన్నారంటే అది వేరే సంగతి.

ఇదిగాక అత్తాకోడళ్ళ విరోధం మరొక సమస్య. ఈమాదిరి కథా వస్తువుతో ఇప్పటికే ఎన్నో చిత్రాలు వెలువడ్డాయి. అదే సమస్యను పాతిఫక్కిలో ఈ చిత్రంలో చొప్పించటం చిత్రవిజయానికి ఏవిధంగానూ తోడ్పడేదిగా లేదు. అత్తగారు కోడలిపట్ల నిష్కారణంగా ఎందుకంత క్రూరంగా ప్రవర్తిస్తుందో అర్థంకాదు. అది అర్థం కానంతకాలం ఆ సమస్యకు వాస్తవికత రాదు; కృత్రిమంగానే ఉంటుంది.

ఇలాగే దుష్టుడైన భర్తను సుశీల స్వీకరించాలా, లేదా అనేది మరొక సమస్య. ఈ సమస్యనుగూడా చిత్తశుద్ధితో పరిష్కరించడానికి నిర్మాతలు ప్రయత్నించలేదు. స్వీకరించినా, స్వీకరించకపోయినా ఒకటేనన్న ధోరణిలో విడిచిపెట్టారు.

ఈ చిత్రంలో వచ్చే అనేక పాత్రల్లో ఏ ఒక్క పాత్రకీ స్వతంత్రంగా ఆలోచించుకునే శక్తి, తమ్ము తాము అదుపులో పెట్టుకునే శక్తి ఉన్నట్టులేదు. విధిచేతుల్లో కీలుబొమ్మల్లాగ, కథకుడు ఎటు ఆడిస్తే అటు ఆడతారు. ప్రేక్షకులకు ఆదర్శప్రాయురాలు కావలసిన సుశీల మొదటినుంచి చివరదాకా కాస్తయినా పరిస్థితుల మీద తన ప్రభావం కనబరచదు. చదువు మానటం, పెళ్లికావటం, భర్తయింటినుంచి వెళ్ళిపోవటం, చాకలి పనిలో కుదరటం, తరవాత నర్సుగాపనిచెయ్యటం అంతా దైవాధీనంగా జరిగిందే తప్ప ఒక్కటీ ఆమె స్వాతంత్ర్యేచ్ఛకు నిదర్శనంగా లేదు. ఇటువంటిపాత్రనుంచి ఏ ఆదర్శం నేర్చుకోవలసివుందీ, ఆమె ప్రవర్తన అణగారిన స్త్రీజనానికి ఏవిధంగా ధైర్యం కలిగించేదీ బోధపడదు. ఇదేమాదిరిగా ఏపాత్రచూసినా సానుభూతి కలిగించేదీ, ప్రేక్షకులకు కాస్తయినా సన్నిహితంగా వచ్చేదీ ఒక్కటీ కనబడదు. అసలు ఏపాత్ర మానసికస్థితినీ ప్రేక్షకులకు పరిచయం చేసే ప్రయత్నమే జరగలేదు.

దర్శకత్వంలో ఉదాహరణకైనా మంచి

అంశం దొరకదు. డా॥ రాజారావుగారు నిర్మాతగాను, నటుడుగాను ఉంటూ దర్శకత్వం మరొకరికి విడిచిపెడితే ఇంతకన్న మంచి చిత్రం లభించేది. సుశీల రజస్వల అయినప్పుడు పువ్వు వికసించినట్లు చూపటం, రాఘవరావు, ఆర్. జి. పాల్ జిమ్మీలచేత *Tap dance* చేయించటం వగైరా ఘట్టాలు అసభ్యంగా వున్నాయి. దర్శకత్వంలో *Restraint* లేకపోవటం పెద్ద లోపం. నటీనటులచేత అతిగా నటింపించటం, నాటకరంగంమీద కూడా అభినయం వాస్తవ ప్రవర్తనకు సన్నిహితంగా ఉండాలనుకునే ఈ రోజుల్లో సినిమాలో భీభత్సంగా అరిపించటం, కరచరణాద్యవయవాలు విరివిగా ఉపయోగించటం, కొన్ని పాత్రలను అమానుషంగా కొట్టించటం జుగుప్స కలిగిస్తాయి.

స్క్రీన్ ప్లే రాసుకోవటంలోనే అసలు లోపం కనిపిస్తుంది. ఒక సన్నివేశం మరొక సన్నివేశంలోకి విరుగుతుంది తప్ప పెరగదు. వివిధ దృశ్యాలు హఠాత్తుగా ప్రారంభమై హఠాత్తుగా అంతమౌతాయి.

అన్నిటినీ మించినది శబ్దగ్రహణం. షాట్ నిశ్శబ్దంగా ప్రారంభమై మధ్యలోగాని రికార్డింగ్ యంత్రం తాలూకు రొద వినిపించదు. బస్సులూ, రైళ్ళూ నిశ్శబ్దంగా నడిచిపోతాయి. పాటలు చెవుల తుప్పువదిలేట్టు 'గీ' పెడతాయి.

వి. ఎన్. రెడ్డి, అజిత్ కుమార్ గార్ల ఛాయాగ్రహణం బాగున్నది. కొన్ని షాట్లలో వి. ఎన్. రెడ్డిగారి ఛట్లు కనిపిస్తాయి.

సుంకర, వాసిరెడ్డిగార్ల సంభాషణల్లో లేని పస పాటల్లో కనిపిస్తుంది. పాటలన్నీ బాగానే వున్నాయి. మోహనదాసు, చలపతిరావుగార్ల సంగీతం ఈ చిత్రంలో కల్లా మెచ్చుకోవలసిన అంశం.

రాజా ప్రొడక్షన్సు వారు చక్కటి సాంఘిక చిత్రం అందిస్తారని అనేకులాశించారు. ఆ సంస్థ వారి ఆశయాలు, చురుకుదనం, క్రమశిక్షణ, టీమ్ వర్కు పలువురి అభినందనకు పాత్రము లయినాయి. కాని వారి చిత్రం మాత్రం తీరని ఆశాభంగం కలిగించింది. దాని కారణాలు సవరించుకుని ముందుముందు మంచి చిత్రాలు తీస్తారని ఆశిస్తున్నాం. ★



## ★ ఫిలిం సెన్సార్‌షిప్ సమస్యలు ★

మద్రాసు ప్రాంతీయ సెన్సార్ అధికారి శ్రీ. శ్రీనివాసన్ గారు ఈనెల 4 వ తేదీన తమ కార్యాలయంలో పత్రికల వారితో గోష్ఠి జరిపారు. గడిచిన సంవత్సరపు చిత్రాలను అంచనా కడుతూ, అశ్లీలం,

(50-వ పేజీ చూడండి)

మార్చి విడుదల

లోకం
బ్రతకటానికి
సాయపడదు
చస్తామంటే
ఒప్పుకోదు
రక్షించదు
శిక్షిస్తుంది!




డిస్ట్రిబ్యూటర్లు: ఆంధ్ర, సీడెడ్: నైజామ్: పూర్ణా రిలీజ్.
నిర్మాతలు: అరుణా ఫిలిమ్సు మద్రాసు - 17.

# ప్రశ్నలు..సమాధానాలు

శ్రీ పి. ఆర్. ఎన్. రావు—హైదరాబాదు.

ఇటీవల విడుదలైన ప్రతీ తెలుగు చిత్రంలో 1నర్సులను 2 గుర్రపు పందాలను, ఎందుచేత ప్రవేశపెట్టుచున్నారు?

—1. చీరలు, జంపర్లవారిని గౌనుల్లో అలంకరించడానికీ, 2. నిర్మాతల ఆర్థిక విజయం గుర్రపుపందేల ఫలితాలమాదిరిగానే ఉన్నాయని తెలుపుకోడానికీ కావచ్చు.

* * *

శ్రీమతి అక్కులకమల—కొండపల్లి.

మన తెలుగు తారలలో అగ్ని సాక్షిగా వివాహము చేసుకొన్నవారెవరయినా వున్నారా?

—ఉన్నారు. అయినా తారాపథాని కెగిరిన తరవాత అగ్నిదేవుని సాక్ష్యమెంతటిది?

మన తెలుగు చిత్రాలలో ఎక్కువగా హిందీ చిత్రాలలోని పాటల స్టయిల్సు పెట్టున్నారు, ఎందువలన? మన రచయితలకు చాతగాకనా?

—'ఆ స్టయిల్సు' అన్నీ హిందీ-చిత్రాల వారి సొంత సొమ్ము కావు.

* * *

శ్రీ కందా శ్రీనివాస్—కాకినాడ.

ఆంధ్రదేశానికి ముఖ్యపట్టణము మీ ఉద్దేశంలో ఏది అవుతే బాగుంటుంది.

—ముందు ఏ మున్సిపాలిటీ బాగుపడుతుందో అది.

* * *

శ్రీ యమ్. అభిమన్యు—కర్నూలు.

ఒక చిత్రముయొక్క బాగోగులను పత్రికలయందు విమర్శించేవారు డైరెక్టుచేస్తే ఆ చిత్రాలు తప్పక ప్రజారంజకము కాగలవని నా భావము. మీరేమంటారు?

—ఇప్పటి నిర్మాతలు విమర్శకులైనప్పుడు వారు చెప్పవలసినదామాట.

* * *

శ్రీ జి. మోహనరావు—కరీమ్ నగరం.

సాపత్య భావాలు చాలా ఉన్నాయి. భాష లేదు. ఏంచేయమంటారు?

—మూకకవిత్వం అల్లుకోండి.

* * *

శ్రీ గబ్బిట ప్రసాద్—గుడివాడ.

ఈ మధ్య మా పరిసర గ్రామాల్లో ప్రతివారూ నిరాహారదీక్ష అవలంబించుతున్నారు. అది గౌరవమా? కళా? లేక అభిమానము కొఱకా?

—ఆరంభించడానికది సులువుకాబట్టి.

* * *

శ్రీ పి. రాజరత్నం—విశాఖనగరం.

గతసోమవారమురోజు సురులకన్న, అసురులు బలవంతులని రేడియోలో విన్నవించిరి, ఎందువలన?

—సురాపానం మాత్రం కారణం కాదు.

* * *

## "కోవాడిస్"

ఎమ్. జి. ఎమ్. వారి "కోవాడిస్" టెక్నికలర్ చిత్రం ఇటీవల మద్రాసులో విడుదల అయింది. భారీయెత్తున, చాలా ధనవ్యయంతో, కళ్లు చెదిరించే రంగులతో, బ్రహ్మాండమైన సెట్టింగులతో తీయబడిన చిత్రం ఇది. పబ్లిసిటీకే నిర్మాతలు కొన్ని లక్షలు ఖర్చు పెట్టివుంటారు. ఈ పబ్లిసిటీ మహిమో, ఏమోగాని హెచ్చించబడిన రేట్లకుకూడా జంకక ప్రేక్షకులు అసంఖ్యాకంగా హాజరవుతున్నారు.

నీరో చక్రవర్తి రోమన్ సామ్రాజ్యం పాలించే రోజుల్లోని ఇతివృత్తం ఈ చిత్రానికి ఆధారం. క్రౌర్యానికి, నిరంకుశత్వానికి పేరుపడిన నీరో రోమ్ నగరం తగలపెట్టించటం, చివరకు ప్రజలు పదభ్రష్టుణ్ణి చేయటం కథలో ముఖ్యాంశం. రంగులు, సెట్టింగులు, కెమేరా ఆంగిల్స్, టెంపో, సస్పెన్సు, పిక్చర్ సెన్స్ వగైరా బాక్సాఫీసు సూత్రావళితో ఈ చిత్రం ప్రేక్షకులను ఆకర్షిస్తోంది. అంతకుమించి నురేమీ ఉన్నట్టు కనబడదు. ★



అరుణావారి "గుమాస్తా" లో పండరిబాయి, మనోహార్, జయమ్మ.

# ★ ఫిలిం సెన్సార్‌షిప్ సమస్యలు ★

(47-పేజీ తరువాయి)

అసభ్యం అనిపించే అంశాలు దక్షిణభారత చిత్రాల్లో చాలవరకూ తగ్గిపోయాయనీ, ప్రభుత్వచట్టాలను, పరిపాలనను, మతవిశ్వాసాలను విమర్శించటంమాత్రం ఎక్కువైందనీ, ప్రజాభిరుచిపేరుతో అవాంఛనీయమైన దృశ్యాలు ఇంకా దక్షిణభారత చిత్రాల్లో చూపించబడుతూనే వున్నాయనీ ఆయన అన్నారు

ఫిలిమ్ సెన్సార్ షిప్ పట్ల ప్రజానీకం ఆసక్తి కనబరుస్తున్నదనీ, ఈ ఆసక్తికి ఒక నిర్దిష్ట రూపం గనక ఇస్తే తమకు చాల సహాయకరంగా ఉంటుందనీ ఆయన అన్నారు "గడచిన రెండేళ్ళలో కలిగిన అనుభవాల మూలంగా సెన్సారింగ్ విధానంలో కొన్ని మార్పులు చేయబడినై. ఫిలిం పరిశీలన సంఘాలలో నలుగురు సభ్యులు నియమించబడ్డారు సినిమా చిత్రాలకు ఇవ్వబడే సర్టిఫికెట్లు అయిదేళ్లవరకే చెల్లుతాయి ఆపైన తిరిగి సర్టిఫై చేయించుకోవలసిందే," అని ఆయన అన్నారు

"1951 జనవరినుండీ 1952 మార్చివరకూ గల 15 నెలల్లో మొత్తం 83 కథా చిత్రాలు పరిశీలించాము. 1952 ఏప్రిల్ నుండి 1953 ఫిబ్రవరి వరకూగల 11 నెలల్లో 78 చిత్రాలు పరిశీలించాము. పౌరాణిక, జానపద చిత్రాల సంఖ్య చాలా తగ్గిపోయి, సాంఘిక చిత్రాలసంఖ్య ఎక్కువైనది తెలుగు, తమిళ చిత్రాల సంఖ్య దాదాపు సమానంగా వుంది; తమిళచిత్రాల సంఖ్య ఒక్కరవ్వ హెచ్చు దక్షిణభారతీయ చిత్రం సరాసరి పొడుగు ఇదివరకు 16000 అడుగులుండేది ఇప్పుడు 15500 అడుగులకు తగ్గింది.

జానపద, పౌరాణిక కథలపై మోజు తగ్గి సాంఘిక కథలపై ఆసక్తి ఎక్కువ అవుతుందనే విషయం ఇప్పుడు మరింత స్పష్టపడింది సమాజ పరిస్థితులను ప్రతిబింబించే ధోరణి కూడా ఎక్కువైంది సంఘంలోని చెడుగును విమర్శించటం కూడా ఎక్కువైనది. కాని మతాచారాలను, నమ్మకాలను హేళనచేయటం కొంచెం ఆందోళన కలిగిస్తోంది. ఈ విషయంలో నిర్మాతలు కొంత నిగ్రహం చూపవలసిన అవసరం వున్నది," అని శ్రీనివాసన్ చెప్పారు

ప్రజాస్వామిక రాజ్యంలో ఫిలిం సెన్సార్ షిప్‌ను నిర్మాతలకే, వదలివేయవలసి వుంటుందని ఆయన అభిప్రాయపడ్డారు అయితే సెన్సార్ బాధ్యత నిర్మాతలకే అప్పగించేముందు నిర్మాతలు తమంత తామే సెన్సార్ చేసుకోగలస్థితిలో ఉండాలని కూడా ఆయన అన్నారు ★

భరణీవారి "చండీరాణి" లో సర్వసేనాని కుమారుడు ముకుంద్‌గా రేలంగి.

# సినిమా వార్తలు

శ్రీమతి టి. సూర్యకుమారి ప్రస్తుతం సన్నీ ఆర్ట్ పిక్చర్స్‌వారి "ఉరన్ ఖటోలా" అనే హిందీచిత్రంలో రాణిపాత్ర ధరిస్తోంది ఈ చిత్రం నిర్మాత నౌషద్. సంగీత దర్శకుడు కూడా అతడే ఎస్. యు. సన్నీ దర్శకుడు. జాల్ మిస్త్రీ కెమేరామన్ దిలీప్, నిమ్మి, బిపిన్ గుప్త, ఆమా తదితర పాత్రలు ధరిస్తున్నారు ఈ చిత్రం సూర్యకుమారికి మొదటి హిందీ చిత్రం కాగలదు.

* * *

బ్రిటిష్ నిర్మాత అలెగ్జాండర్ కోర్డా ఇండియాలో "తజమహల్" అనే చిత్రం నిర్మిస్తాడట. ఈ చిత్రంలో ఒక ముఖ్య పాత్ర ధరించమని ఆయన శ్రీమతి సూర్యకుమారిని అడగవచ్చునని తెలుస్తున్నది

* * *

ఈ నెలలో మూడు తెలుగు చిత్రాలు విడుదల కావచ్చును. ఒకటి "నమాస్తా", రెండు "అమ్మలక్కలు", మూడు "కన్నతల్లి" రోహిణీవారి "ప్రతిజ్ఞ", శోభావారి "పరోపకారం", చిత్రాల నిర్మాణంకూడా త్వరలో పూర్తికావచ్చునట.

* * *

కేంద్ర ఫిలిం సెన్సార్‌బోర్డు తాలూకు మద్రాసు ప్రాంతీయ అధికారిగా పనిచేసిన కె. శ్రీనివాసన్‌గారు కలకత్తాకు బదలీ అయ్యారు ఆయనకు వీడ్కోలివ్వటానికి వాహినీ స్టూడియోలో పెద్దవిందు, సభ ఏర్పాటుచేశారు మద్రాసులోని స్టూడియోల యజమానులు, ప్రముఖ నిర్మాతలు కమిటీగా ఏర్పడి ఈ వీడ్కోలు ఉత్సవం జరిపారు. స్టూడియో ఆవరణలో విజయవారి "చంద్రహారం" తాలూకుకోటసెట్ ఉన్నది ఈ సెట్ ఎదురుగా వేదిక, సీట్లు అమర్చారు. చుట్టూ విద్యుద్దీప తోరణాలు వగైరా శోభాయమానంగా అమర్చారు

సభకు అధ్యక్షత వహించిన ఎస్. ఎస్. వాసన్ ప్రాంతీయ సెన్సార్ అధికారిగా శ్రీనివాసన్‌గారు చేసిన కృషిని, వారు నిర్మాతల కష్టాలు గుర్తించి చేసిన సహకారాన్ని ఉగ్గడించారు సెన్సార్‌షిప్ బాధ్యత ను నిర్మాతలకే వదిలిపెట్టాలని, రాజ్యాంగం ప్రతిపౌరునికి యిచ్చే హక్కులనే సినిమా నిర్మాతలకు కూడా ఇవ్వాలనీ, నిర్మాతలు తమ హక్కులను దుర్వినియోగపరచరని ఆయన అన్నారు

ఆ తరువాత హెచ్. ఎమ్. రెడ్డిగారు తోడి నిర్మాతల తరఫున, స్టూడియో యజమానుల తరఫున శ్రీనివాసన్‌కు వీడ్కోలు పత్రం చదివి సమర్పించారు. శ్రీనివాసన్ సమాధానమిస్తూ సెన్సార్‌షిప్ బాధ్యత నిర్మాతలకే అప్పగించాలనే వాదనను సమర్థించారు అయితే నిర్మాతలు, దర్శకులు, రచయితలు, నటీనటులు తమ సాంఘిక బాధ్యతలను గుర్తుంచుకోవలసిన అవసరం ఉందన్నారు శ్రీ ఎ. రామయ్యగారి వందన సమర్పణతో సభ ముగిసింది తరువాత కుమారి కమల భరత నాట్యం ప్రదర్శించి ప్రేక్షకులను అలరించింది



# ★ అమావాస్య పున్నమి ★

(9-వ పేజీ తరువాయి)

వల్లే వెళ్ళి లారీలు పోతున్నా లక్ష్యం చెయ్యక గేట్లు దబాయించి మూసేశాడు. లారీ డ్రైవర్లు హారన్లు కొట్టారు. తనకుగాద న్నట్టుగా రాములు అటు తిరిగి గూడా జూడలేదు. ఇంతలోనే రైలు వచ్చింది- పెద్దకూత కూసి. మళ్ళీ గేటుమీది గంట. రాములు గేట్లు మూసినవాటిని తెరిచేశాడు. మాలచ్మి భయంతో వణుకుతూ యీ చర్యంతా చూసింది.

"చూశావా, ఎక్స్‌ప్రేసు"

"ఏడకి బోద్ది?"

"కలకత్త"

"ఆఁ"

"మరేం దనుకొన్నావ్?"

"మరి ఆ లారీవోళ్ళు అట్లా అరగంట నిలబడ్డారే. ఆళ్ళకు కోపం వస్తే"

"ఆస్సి. ఆళ్ళ కోపం? మనం రాజు లనుకో ఆ కాంతసేపు."

మాలచ్మి భయం పోయింది. ఆ లారీ వాళ్ళకు దమ్ములేవు. రాములు నీలి చొక్కా, పచ్చ జెండా జూడగానే వాళ్ళ యింజన్లు ఆగిపోవా, మరి?

మళ్ళీ యింకో బండి. పెద్దది. జనం లేని ఖాళీ పెట్టెలు. "మాల్ గాడీ" అన్నాడు రాములు.

"ఏడకు బోద్దో..."

'ఏడకంటా...ఓస్సి...ఒక దిక్కేంటి? నాగపోర్, డిల్లీ, డేరాడూన్...'' తన అబద్ధాలకు తనేలోలోపల నవ్వుకొన్నాడు రాములు.

''నిజం?'' అంది పెద్దకళ్లు చేసుకొని మాలచ్మి.

''నిజం!'' అన్నాడు చిన్న కళ్ళ రాములు.

* * *

మాలచ్మికి కొత్తపోయింది. కొత్తలో వింతగూడా. నిద్రబోతూనే రైలుకూతలు వినాలి. రాములు ఆదుర్దాతో తిండి తింటాడు. నిద్రగూడా కునికిపాట్ల నిద్రే. గంట మోగితే ఉలిక్కిపడి లేచి వెళ్తాడు. ఎక్స్‌ప్రెసు, మెయిలు, గూడ్సులు, పాసెం జర్లు వల్లగా రాక్షసి బొగ్గుతో యిల్లంతా బూజుగొడుతూ, తిండిలో బొగ్గు లేరు కొంటూ!! మాలచ్మి మంచిమంచి వంట కాలు చేసి రాములికి పెట్టింది. ఇక్కడ చల్ల చుక్క గూడా కొనుక్కోవాలి. అర్ధణా బెడితే గిద్దెడు నీళ్లు రాలేదు. రైళ్లకూతలకు తోడు, సిమెంటు ఫ్యాక్టరీ సైరెన్లు. ఇది సందయినపుడు అది కూస్తుంది. చెవులు చిల్లులు పడతాయి. మాలచ్మికి ఒక్కోసారి యేడుపొచ్చేది. పొద్దుస్నే లేచి, తిరిగినిద్ర బోయిందాకా, నిద్రలో, తెల్లవార్లూ యీ కూతలు వినాలి. అర్ధణా పెట్టినా గిద్దెడు చల్లచుక్క రాలనిదేశం. కరువులోగూడా వాళ్ల వూళ్ళో చల్లమ్ముకొన్న గర్భాత్రపు అమ్మలేదు. రాములుగూడా మాలచ్మికి కొత్త వదలగానే, యింటిసంగతి మరిచి పోయినాడు. మొదట్లో అయితే యింత కుడిజేసి యింటివెనక వంగలు వేసింది మాలచ్మి. కాని గేట్లు మూసినప్పుడు లారీ డ్రైవర్లు బీడీలు కాల్చుకుంటూ దిగి, వంగ తోటను ధ్వంసం చేశారు. రాత్రిళ్లు మిల్లు కూలీ జనం మిగతావాటిన ఒకటి అర కాయ బడితే దొంగిలించారు. ఎంత ఎదురుజూసినా, బొగ్గుదుమ్ము కళ్లతో గంటల గణగణా రైళ్ళ కూతలూ, సిమెంటు ఫేక్టరీ సైరన్లూ ఎన్నిసార్లు తిరిగి తిరిగి లెక్కించినా మాలచ్మికి పొద్దుపోయేది గాదు. రెండు పొట్టల వంట యింతలోనే అయి పోయేది. అయిపోయిం తర్వాత? రాములు నీలిచొక్కా గుండీలు తెగిపోతే కుట్టేది. గుండీలు రోజూ తెగవి కావు. మాలచ్మి రాములుకోసం కాచుకునేది. రాములు, పట్నం కబుర్లు జెపితే యింతలోనే అంత పొద్దు కూలేది. కాని రాములు కొత్తగా నేర్చుకొన్న బీడీలతో, ఫేక్టరీవాచిమన్లను పిలిచి గప్పాలు గొట్టుకొంటున్నాడు.

* * *

మాలచ్మి వచ్చింతర్వాత రాములు సెలవ దీసుకోలేదు. ఒక రోజున—''మాలచ్మీ, పట్నం బోయి యియ్యాళ యింటిసామాను దెస్తాను. సాయంత్రం సెలవు మీద బోతాను'' అన్నాడు. తన్ను గూడా రమ్మంటాడని మాలచ్మి మునివేళ్ళమీద కూచొంది. రాములు అన్లేదు.

మాలచ్మి ఒంటరిగా రైలింట్లో నల్ల బారిన పెంకుకప్పు జూస్తూ మంచంమీద పడుకొంది. రాములు చోట్లో గేట్లుమూసేం దుకు పట్నంనుంచిగామాలు యింకో మనిషి వచ్చాడు. ఎక్స్‌ప్రెసు పోగానే ఆ మనిషి, కోరగా మీసాలు దువ్వు కుంటూ వచ్చి — మంచినీళ్ళ డిగాడు. మాలచ్మికి ఆ చూపు నచ్చలేదు. ''మా వూ రయితేనా? నడ్డిమీద వడ్డించేదాన్ని'' అని అనుకొంటూనే నీళ్ళందించింది. నీళ్లుతాగి, కోరమీసాలు పోకుండా నిలబడి ఆమాటా, యీమాటా అడిగాడు. ఆమాటలకు మాలచ్మి సిగ్గుపడింది. కోపం వచ్చింది. ఈ బస్తీవాళ్లు మంచివాళ్లు గాదు.

రాములు అర్ధరాత్రికిగాని రాలేదు. "బయస్కోపు కెళ్లినాం. తమిళం. ఓస్సి. మంచికత్తిసాములే-" అంటూ మాలచ్మికి సామాన్లం దించాడు. మాలచ్మికి వళ్లు మండింది.

అన్నంబెట్టి "ఆ మనిషి మంచోడు గాదు" అంది - మూతి అటు తిప్పుకొని.

రాములు ముద్ద నోట్లో కుక్కుకుంటూ - ''ఓస్సి - ఆడు మంచాడు గాదని నువ్వ నాలి. ఆడుగాదా సాకేడవుద్దోగం వుందని జెప్పింది మొదట్లో. ఆడికి తెలుగురాదులే. అరవపోడు'' అని ముగించేశాడు. రాము లికి అర్థంకాలేదు. మాలచ్మి అర్థం విరిచి చెప్పలేకపోయింది. రైళ్ళకూతలమధ్యనే నిద్రవచ్చింది.

వచ్చేవారం రాములు మళ్ళీ వెళ్ళాడు పట్నం.

''యివ్వాళ యారి మొగం జోశానో''. అనుకుంటూ తిరిగి వచ్చాడు.

"ఏమయింది?"

''అయిదు రూపాయలు నష్టం''

''పో...యిందా?'' అని మాలచ్మి భయ పడింది.

"ఓస్సి...నీకేం దెల్సు పట్టాలో గట్టి నాం నేనూ పేక్టరీ వాచిమేను గల్సి. పులుసులో గలిసిపోయింది."

"—మ...రి..."

''మరీ లేదు గిరీలేదు'' అని చిరాకుగా అన్నాడు చివరకు రాములు. మాలచ్మి మాట్లాడలేదు. వణుకుతున్న చేతుల్తో రైలు దీపం ముట్టించి రాములుచేతి కందించింది. మాలచ్మికి రాములుదగ్గర వాసన గొట్టింది.

## 6

ఆ పైనెల్లో మాలచ్మికి దమ్మిడీ యివ్వ లేదు రాములు.

"జీతమంతా అయిపోయింది...ఖలాస్" అన్నాడు.

మాలచ్మితో గొల్ల చల్లమ్మి పోట్లాడింది. ఒకపూట తిని, పాతగుడ్డలు ముందరేసుకొని కుట్టుకుంటూ కూర్చొన్నది. సాయంత్రం రాములొచ్చి ''నీకంటె యిటు దేవే మాలచ్మీ" అని చెయి జాపాడు. చీనితోట అమ్మగా వచ్చిన రొక్కంతో కాసుల కంటె జేయించుకొన్నది మాలచ్మి.

''ఎందుకో?"

"పనుంది. యిటుదే?"

"నే నియ్యను. మా అయ్యసొమ్ము." అంది మాలచ్మి. మాలచ్మి చేతులు యే ప్రయత్నం చేయకుండానే మెడలో కంటెను గట్టిగా లంకించుకొన్నవి. ఎందుకు

కంటె అడిగాడో మాలచ్చికి తెలుసు. నిన్న సాయంత్రమే శేకరీ కొత్త వాచిమేను పెళ్ళాం చెప్పింది. అయ్యలంతా గలిసి పత్తా ఆడుతున్నారంట.

రాములు ఒకడుగు ముందుకొచ్చి ''నీ పాణం దీస్తా. జాగర్త. ఒళ్లు గాపాడుకో'' అని బెదిరించి వెళ్లిపోయాడు. రాములన్నం దినలేదు. మాలచ్చి దిగులుతో, భయంతో జువ్విచెట్టు కింద కెళ్లి కూచొంది. ఎవరితో చెప్పుకొంటుంది? ఈ బస్తీజనం నిద్రలేచింది లగాయితు ఎవరి బదుకు వాళ్లు చూసుకోటాని కలవాటయి పోయినారు. పక్కింట్లో హత్య జరుగుతున్నా పట్టించుకోరు. కొత్త వాచిమేను పెళ్ళాం, తన లాగా పల్లెటూరునుంచి వచ్చినపిల్ల. కాని వాచిమేను జాస్తి కొడతాడు.

సీకట్లో పాలెం డొంకలో తల విరబోసుకొన్న పొడుగు దయ్యంవలె జువ్విచెట్టు నిల్చివుంది. ఎందుకు తనిక్కడికి వచ్చింది? చీనితోట, రాములుబావ, బసవమ్మపాలు, చెరువునీళ్లు, ఏతాము, నాయన-ఏవీ, ఒకనాడు మురుసుకొన్న యీ సొమ్ములు? వీటికి బగులు పీడకలతర్వాత భయంలాగా రైలుకూతలు, దుమ్ము, శేకరీ పొగొట్లు, లారీలకంపు, నల్లగా మసిబారిన కొంప, ప్రాణం దీస్తానని బెదిరిస్తున్న మొగుడు. ఆలోచనలతో మాలచ్చిబ్రవణికి, జువ్వి చెట్టు నీడను గూడా జూడలేక, కన్నీళ్లు తుడుచుకొన్నది. బావ వుద్యోగం అంటే ఏమిటో నమకొని కన్న కలలు, యిప్పుడు యీ ఆకలి, రోగం, నిరాశ ముందు బలి ఆయిపోయినాయి. బావజూదం ముందు పాతకలలు. మాలచ్చి కత్తిరబడ్డవి. తోటలో నిమ్మనీడకింద చాకిరినొప్పులన్నీ మరిచి, బావతల్లో పేలు జూసిన మాలచ్చికి తనకేనా బావను జూస్తే ప్రాణభయం? ప్రభలుగట్టే రోజున బావకు తలంట్లుబోసి, కొత్త పంచెలుగట్టబెట్టి, కుంకం బొట్టు కల్యాణంగా బెట్టి, శ్రీశైలవు సాగనంపిన తననేనా, బావ "జాగర్త, ప్రాణం దీస్తా" నన్నది? కలలో, పనిలో, ఉమలో, నిశలో తన బావ రాములు ఒకనాడు. మరిచి, విరిచి మాట్లాడే యీ బావ రాములు? తన చెప్పులు మోసి, తనను నీడ గూచోబెట్టిన పాత బావలో యీ రాక్షసు డెట్లా వుద్భవించాడు?

* * *

మాలచ్చి వెళ్ళి బావను వెతకింది. రేటు పక్క ఇనపకమ్మీలమీద గూచొని రైలుకట్ట మీదికి గులకరాళ్ళు విసురుతున్నాడు తదేకధ్యానతో. మాలచ్చి ముందునిలిచి, తన కంటె తీసి బావ ఒళ్లో నెమ్మదిగా వుంచింది.

''కంటె గావాలంటివే?''

రాములు నమ్మలేదు బిత్తరపోయినాడు. మాలచ్చివంక చూడబోయి కళ్ళు వాల్చుకొన్నాడు.

''వద్దు...'' అనగలిగాడు చివరకు.

''కావాలని...?''

రాములు-తనలోని మానవుడివైపు, రాక్షసుడివైపు చూచుకొన్నాడు.

''ఈ ఒక్కసారి ఆడతా. వాచిమేను జెబుతున్నాడు. ఆడికి అంకె దల్చిందంట. మన పోయిన డబ్బుతో అంతా రావాలి. నీకు చీరెలు దెస్తా మాలచ్చి. ఒస్సి-నవ్వావులే...అద్దిగో...నవ్వినావులే.''

రాములు డ్యూటీ అయిపోగానే మాయమై తెల్లవారుఝాము కొచ్చి తలుపు ఢట్టాడు. మాలచ్చి లేచి వట్టి చేతుల రాముల్ని చూసింది. బావిదగ్గిర మొదట్లో కొట్టిన సారాకంపు గొట్టింది.

మాలచ్చి కంటెసంగతి అడగలేదు. కాని తన మూర్ఖత్వాని కది అవమానంగా పెంచుకొనాడు రాములు. మాలచ్చికి తన్నులు దప్పలేదు. మట్టిగాజులన్నీ చిట్లిపోయినై. తలమీద బొప్పులు గట్టినవి.

మళ్ళీ కొద్దిరోజులు రాములు మారిపోయాడు. జీతం రాగానే మాలచ్చికి రవిక గుడ్డలు కొన్నాడు. కన్నయ్య చూడనొస్తే మంచి మర్యాద జేశాడు.

మాలచ్చిని మంచి జేసుకోబోయి— "రైల్లోళ్ళందరు సమ్మె గడతారంట. ఆ గొడవల్లో నేం గల్పేదిలేదు" అన్నాడు ఒకరోజున.

"అళ్ళందరూ ఎదవలేనా?" అని మాలచ్చి అమాయికంగా అడిగింది.

"కాక మరి?"

కాని సమ్మెరోజున తనుగూడా రేటు వదిలి పొయ్యాడు. సమ్మెలో రాములుద్యోగం పోవాలని మాలచ్చి మొక్కుకుంది. ఈ దరిద్ర వుద్యోగం బోతే మళ్ళీ వూరుజేరి, చిన్నతోటెదుకొని, పాత రోజులు అనుభవించవచ్చు. కాని సాయంత్రానికల్లా సమ్మె లేదని తెలియవచ్చింది.

* * *

రాములు జూదాలకు పోవటంలేదు; కాని రోజురోజుకూ బస్తీమనిషైపోయాడు. మాలచ్చికి రవికలు గొన్నాడు, మనసు కొనలేదు.

మాలచ్చి యింటి దిగులుతో కుంగిపోయింది. ప్రకృతిని పిలిచింది. రైలు దుమ్ము, శేకరీ కుళ్ళులో జీవితమంతా మురికై మురిగిపోగా, తనబావ జూదరై, పలకరించే దిక్కు లేక! హృదయమిచ్చి మాట్లాడే మనుషులేరు. తను చీనితోటలో ఏతాం సంగతి చెప్పితే అర్థంజేసుకోగల అప్పులేరు. చెట్లూ, డొంకలూ, వాగూ, చెరువూ, చీని తోటలూ, చిన్ని గూడల చెంగణ పొద్దుకన్నె పిట్టలూ, ఎద్దుల మె మువ్వలూ, హరిదాసు కీర్తనలూ, గొ మ్మలూ, రేగడి పెరుగూ—యిక్కడే! డున్నై? వాటి నెప్పుడైనా చూ పొంది ఆనందించిన వాళ్ళొక్కళ కన్పించలేదు మాలచ్చికి.

మాలచ్చికి ఎక్కడా దగర్లో దేవుడి కనిపించలేదు. తమ వూళ్ళో పూజారివ నంబినామాలూ చూడలేదు...యిక్క కొచ్చింతర్వాత. పండగలకి యిల్లం పాటిమట్టి పూతబూసి, మందంగా పేడ అలికి ముగ్గులు బెట్టటాని కిక్కడేముంది

పార్వతమ్మోదినా, ముత్యాలు గా నూరీడు, కవల పిల్లలు సీతమ్మ, రాజమ ఒకనాటి తన స్నేహితురాళ్ళు. పండే కొని చెరువునించి నీళ్ళు మోసుకురావ నికీ, వెన్నెలలో మొగ్గలాట ఆడుకో దుకు, గారెలు పంచుకోటానికీ, వో మార్చుకోనేందుకూ, గుళ్లో కొబ్బరిముక లకూ వాళ్ళు పిలుస్తున్నారు. వ నవ్వింది. వాగుమీద ఒంటి తాటి బొ బ్రిడ్డి ఏడ్చింది. చెలువు చేతులెత్తి సైగ చేసింది. పాత చీనితోట జాలిగా ఏ రమ్మన్నది. కాని రాములుకే మనసు లే

## 7

తోచక కూర్చున్నది మాలచ్చి. రే మాసునైన్లు. నాగపూర్, డేరాడూన్ లైనుమీదబోయే రాములు గూడ్సు బం పోతున్నది. రేటు యీవల నుంచొన్న ముసిలాడెవరు? గొల్లశేషు గాదూ?

"శేసు మామా! శేషు మామా"

ముసిలాడు చూసి ఒక్క గంతువేశా

"మా అమ్మ! మా అమ్మ!! మా ల ను విక్కడున్నావా?" అని శేసుమా మాట దింపుకొన్నాడు. శేసుమామ రా శ్వరం బోతున్నాడంట.

ఆరాత్రి శేసు మామ చాలా పొద్దు యిందాకా "సుద్దులు" పాడాడు. "హ హరీనారాయణ ఆదినారాయణా, కరుణిం మ మేమ్మలు కమలలో సముడా"— అని శే



# అమావాశ్య పున్నమి



మామ చెవుమీదకు చెయి బోనిచ్చుకొని ఆలాపన బాడి – సీతమ్మ వనవాసం – కథ చెప్పాడు. లోకంనిందలు బడలేక రాముల వారు సీతమ్మను అగ్నిప్రవేశం చెయ్యమంటం, అందులో ఆమె నెగ్గటం చివరకు భూదేవిని సీతమ్మ ప్రార్థించి తనకు దారి యిమ్మంటం, భూదేవి బీటలు వారగా అందులో సీతమ్మ మాయం గావటం.

మాలచ్మి ఏడ్చింది.

"ఎందుకే...?" అన్నాడు రాములు.

"మావూరు బంపించవా బావా! ఇద్దరం అడకళ్ళి సుఖపడదాం."

"ఊస్సు. ఆడేముంది? బూడిద."

మాలచ్మి ఏడవనూ లేదు. మాట్లాడనూ లేదు.

*   *   *

పొద్దున్నే శేసుమామ పయనంగట్టాడు. ఆరోజున ఎక్సుప్రెసు కింద మనిషి బడి చస్తే, ఆ పనికి బోయినాడు రాములు. మాలచ్మి, మామను సాగనంపబోయింది.

"మాఁవా! సీతమ్మ పార్ధనకు తల్లి బలికిందా?"

"ఖరి పలకుక్కుంటే జానికమ్మ భూమిలో కెట్టా బోయింది?"

శేసుమామ మా లచ్మివంక వింతగా జూచాడు.

"ఇదుగో ఆ రైలుకింద బడితే, ఆ మనిసి...ఆమెను మాత్రం తల్లి గాదూ బిలిచింది? సీతమ్మతల్లి అనుమతి లేందే చీమైనా గుట్టదు."

"నిజం మావాఁ!"

"ఇక వుండు మా అమ్మ! మా లచ్మి! చాలాదూరం నడిచావు."

శేషుమామ రామేశ్వరయాత్ర బోయినాడు.

*   *   *

మర్నాడు రాత్రి మెయిలు నిన్న ఎక్స్ప్రెసు ఆగినచోటనే ఆగిపోయింది.

"ఆడమనిషి...పాపం కుర్రది...... యిరవై ఏళ్లు గూడా లేవు" అన్నాడు లైటు వేసిన గార్డు.

"గేటుమన్‌ను పిలవండి."

ఇంతలోనే సిమెంటు ఫ్యాక్టరీ వాచిమెన్ వచ్చి, శవాన్ని చూసి "గేటుమేను పెళ్ళాం బాబూ" అని పెదిమ కరచుకొన్నాడు.

మాలచ్మికిదేమీ తెలియదు. తను భూదేవిని ప్రార్థించింది—భూదేవి బీటలువారి తనను ఐక్యం చేసుకొంటుందని. 



# లోకంతీరు



(10-వ పేజీ తరువాయి)

పోయిన బిందె అందుకుంటూ.

"అసలు మీ కోడలు పనిచేసే ఘటం కాదని చెప్పండి. మీవాడికి ముద్దు. ఆవిడగారికి టెక్కు!—ఇక మీరు చాకిరీ చెయ్యక తప్పదని చెప్పండి. ఏదో ఇంటి గుట్టు కప్పాలని చూస్తున్నారు. కానీ నిజం మాకు తెలీకపోతుందా చెప్పండి." అంది డొకావిడ దీర్ఘాలుతీస్తూ.

"మీరంతా పొరబడుతున్నారు. నా కోడలు మీ రనుకుంటున్న రకం మనిషి కాదు. దాన్ని అర్థం చేసుకోడం కష్టం లెండి." అంటూ మెల్లగా కొళాయి వేపు అడుగు వెయ్యబోయింది. తీరా నడక ప్రారంభించేసరికి ఆమెకు తెలిసింది తన కాలు ఇరుకెట్టిందన్న సంగతి.

ఈలోగా ఒకావిడ పనిపెట్టుకొని శీతమ్మ ఇంటికివెళ్లి, లోన పుస్తకం చదువుకుంటున్న లక్ష్మితో — "ఏవమ్మాయ్!— చక్కగా పుస్తకం చదువుకుంటున్నావు కాబోలు. వెళ్లు వెళ్లు!—మీ అత్తగారు నీళ్లు తెస్తూ పడిపోయేరు. ఏమయినా ముసలావిడ చేత చాకిరీ చేయించుకొనే సాహసికురాలవ్!" అని చెప్పి వయ్యారంగా వెళిపోయింది.

చివుక్కుమంది లక్ష్మిహృదయం !— పుస్తకం ముడిచి వీధిలోకి పరుగెట్టింది. అత్తగారి దగ్గరకు ఆందోళనతో వెళ్లింది. "అమ్మో!—ఇదేమిటండీ!—ఎంతపని జరిగింది! నే తెస్తానంటే తేనివ్వరు!—దెబ్బ తగల్లేదు కదా?" అంది గబగబా వణుకుతూన్న స్వరంతో.

"ఏం ఫరవాలేదమ్మ. కాలు కొంచెం నొప్పెట్టింది. అంతే! ఓ క్షణం ఇలా కూర్చుంటే అదేపోతుంది. నువ్వు వెళ్లు." అంది శీతమ్మ కోడలు తలనిమురుతూ.

"ఇక్కడేమిటి? — మెల్లిగా లేవండి. నన్ను నుకొని మెల్లగా నడవండి." అంది లక్ష్మి.

శీతమ్మ లేచింది. లక్ష్మి నానుకొని మెల్లగా కుంటుకుంటూ ఇంటికెళ్లిపోయింది.

అత్తగారిని దిగబెట్టేసేక లక్ష్మి కొళాయి దగ్గర కొచ్చింది నీళ్లు పట్టుకెళ్లడానికి. కాపురాని కొచ్చేక నీళ్లు పట్టుకెళ్ళడానికి కొళాయిదగ్గరకు రావడం, అది మూడో మారో, నాలుగో మారో!—

ఓ ముసలావిడ ముందుకొచ్చి లక్ష్మి ముఖంలోకి అదోలా చూస్తూ.. "ఔనమ్మా!—నీకెంత సిగ్గులేదే, ముసిలిముండ చేత చాకిరీ చేయించుకొంధికి!" అంది.

మరొకావిడ – "ఏమర్రోయ్! – ఈవిడగారు నవీన నాగరికత కలమనిషి!—ఏమీ అనకండి. ప్రమాదం!...అత్తగారిచేత పని చేయించుకోడం ఈవిడగారి నాగరికత!" అంది.

కన్నీటిని అపుకోలేకపోయింది లక్ష్మి!— వాళ్ళంతా తన నలా ఎందుకంటున్నారో అర్థం చేసుకోలేకపోయిందామె. వుడుకుమోత్తనం హెచ్చయింది. సహించలేనంత కోపం వచ్చింది!—

ఇంకొకావిడ—"ఏవమ్మాయ్!—నాకు తెలీకడుగుతాను; నీమొగుడికి నీదగ్గర భయమనుకుంటాను..."అంది.

మరి సహించలేకపోయింది లక్ష్మి. "మీకెందుకూ నా ఊసు?—" అంది బొంగురు గొంతుకతో. ముఖం కందగడ్డలాగయింది. అప్రయత్నంగా కళ్లంట నీళ్లు కారేయి.

"మా ఇష్టం వచ్చినట్టు విమర్శిస్తాం!— మువ్వెవ్వరివిమధ్య?" అని సమాధానమిచ్చిందొకామె.

లక్ష్మిహృదయం బాగా గాయపడింది. ఎందుకు వాళ్లలా తనమీద ఊరికినే కత్తి కట్టేరో అర్థంకాలేదామెకు. తనేం తప్పు చేసిందిగనక?—ఉదారస్వభావంకలఅత్తకు కోడలవడమా తను చేసినతప్పు — బిందె నిండింది. కళ్లుకూడా నిండేయి నీళ్లతో!— అడుగులు తడబడుతూఉంటే బిందె భుజం మీద ఉంచుకొని ఇంటివేపు అడుగులేసింది లక్ష్మి. ఆమె వెళిపోతూఉంటే, కొళాయి దగ్గర మూగిన అమ్మలక్కలు నానారకాలుగానూ అన్నారు.

లోకులు తనగురించి ఇన్నాళ్లయి ఏమను కుంటున్నారో లక్ష్మికి అనాడే తెలిసింది!— ఆమె మనస్సు వికలమయిపోయింది. తను సుఖంగా ఉండడం లోకుల కంత కష్టంగా ఎందుకుందో అర్థంకాలేదామెకు!—

నిజానికి లోకులు విమర్శించుతున్నట్టుగా, తను అత్తగారిని బాధలు పెడుతున్నదా?—లేదే!—ఆమెకు తనెన్నడూ కష్టం కల్గించలేదే!—కానీ ఒకవేళ తనకు తెలీకుండా తనవల్లామెకు కష్టం కలుగుతున్నదా? పైకి తనముందేమీ అనకుండా లోలోన క్రుళ్లుతూ లోకులముందు తన గురించి చెడ్డగా అత్తగారు ఇన్నాళ్లయి చెప్పకుంటున్నదా?...లక్ష్మి మనస్సు తీవ్ర

మైన ఆలోచనలమధ్య నలిగిపోడం మొదలిపెట్టింది!...

పరుగుమీద బిందె దించింది. వంటింటి వేపు చూసింది. అప్పటికప్పుడే పొయ్యి అంటించి ఎసరుపెట్టింది సీతమ్మ. ప్రక్కనే కూర్చొని అరటికాయలు తరుగుతున్న అత్తగారిని లక్ష్మి చూసింది. ఏదో బాధ ఆమె హృదయంలో చెలరేగింది. లోకుల విమర్శలలో కొంత సబబు వుందనుకొంది......

"అండత్తగారూ!—మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి. నేనివాళ వండుతానంది"

అంతా క్రొత్తగా కనిపించింది సీతమ్మకు! చిరునవ్వు నవ్వింది — "పిచ్చి పిల్లా! — ఆ కొళాయిదగ్గర వాళ్ళేమయినా అన్నారేమిటి?—ముఖం అలా వాడిపోయిందేం?—పోయి ముఖం కడుక్కో! నువ్వేం వండుతావు" అంది.

"మీరిలా అంతపనీ చేస్తూ ఉండడం నాకేం ఇష్టం లేదు. ఇకనుంచీ నేనే పనంతా చేస్తాను!" అంది లక్ష్మి.

మళ్ళీ నవ్వింది సీతమ్మ. "ఓ కొడుకు పుట్టేక చేద్దువుగానిలే! — నాకు ఇంకా సత్తువ ఉండగా నువ్వు నన్ను కూర్చోపెట్టి పనిచేయడం, నన్ను అవమానపరచినట్లవుతుంది! — లోకులు రకరకాలుగా వాగుతారు. దానికేం?—ముఖం కడుక్కొని ఆ పత్రికలో ఏదో చదువుకో! — మీ ఇద్దరూ సుఖంగా ఉండడమే నా సుఖం. అంతే!"

అత్తగారి మనస్తత్వం ఎలాంటిదో అర్థం కాలేదామెకు. ఏంచెయ్యాలో తోచలేదు. అలా ఆలోచిస్తూనే సబ్బుపెట్టి పట్టుకొని పెరట్లోకి వెళ్ళింది లక్ష్మి.

లక్ష్మి పెరట్లోకివెళ్ళేక "పిచ్చిపిల్ల" అని అనుకుంది సీతమ్మ. కోడలంటే ఆమెకు తగనివాత్సల్యం!— కూతురులేనిలోటు ఆమె లక్ష్మిద్వారా తీర్చుకుంటున్నది. ఏముహూర్తాన లక్ష్మి ఆమెకు కోడలైందో ఆనాటినుంచీ లక్ష్మిమీద ఏదో అవ్యక్తమైన ప్రేమ కలిగిందామెకు. లక్ష్మిముఖంలో ఎలాంటి అద్భుతశక్తి ఉందో, సీతమ్మలో మాతృత్వపు పొంగు చిలికింది. లక్ష్మి తుమ్మిందంటే చాలు ఆమెకు భయం! — గట్టిగా దగ్గిందంటే చాలు డాక్టరు రావలిసిందే— లక్ష్మిచేయి ఎఱ్ఱగా కందడం సహించలేని విషయం సీతమ్మకు. కాపరానికి వచ్చిన క్రొత్తలో లక్ష్మి ఈపనీ ఆపనీ చేయడానికి పూనుకొనేది. కానీ కోడలు పనిచేసే అందుకు ఒప్పుకొనేదికాదు సీతమ్మ. కొడుకు రంగనాథంకూడా లక్ష్మిని తన అదృష్టదేవతగా భావించుకొనేవాడు. విశేషం ఏమిటీ అంటే ఏనాడయితే లక్ష్మి ఇంట్లో కాలు పెట్టిందో ఆనాటినుంచీ అంతవరకు ఆర్థికంగానూ, మానసికంగానూ, శారీరకంగానూ ఎన్నో బాధలు పడిన ఆ కుటుంబం, క్రమ క్రమంగా ఆ బాధలలోంచి విముక్తి చెందడం మొదలుపెట్టింది. కొడుక్కి నెలకు నూటఏభైరూపాయల జీతంగల ఉద్యోగం దొరికింది. అంత జీతంగల ఉద్యోగం లభ్యమవుతుందని ఎప్పుడూ అనుకోలేదామె. పైగా అదివరకు అనారోగ్యంగా ఉండే ఆమె కొడుకు లక్ష్మి వచ్చాక ఆరోగ్యవంతుడయేడు. లక్ష్మి ప్రవేశమే ఆ కుటుంబ ఉన్నతస్థితికి కారణమని సీతమ్మ నమ్మకం. అంచేత ఆమెను ఓ లక్ష్మిగా ప్రేమించి సుఖపెట్టడం మొదలెట్టింది. పైగా ఏ పనీ పాటూ చెయ్యకుండా తీరుబాటుగా కూర్చోడం ఆమెకు చాతకాదు. తను పనిచేస్తూ ఉన్నప్పుడు ఇంకొకరి సాయం అపేక్షించడం ఆమె లక్షణంకాదు. పనిచెయ్యడం ఆమెకో అలవాటు!—అంతే!—

ఎంతో అన్యోన్యంగా ఉన్న ఆ కుటుంబాన్ని చూచి అపార్థం చేసుకున్నారు లోకులు. లక్ష్మికి ఆమె భర్త పూర్తిగా దాసుడయిపోడంవల్లా, సహజంగా సీతమ్మ అమాయకురాలవడంవల్లా, లక్ష్మి అలా దర్జాగా ఏపనీపాటూ చెయ్యకుండా సోమరిపోతుతనంగా కూర్చుంటున్నదని లోకుల ఉద్దేశ్యం!—

అదివరకు చాలాసార్లు లోకులు సీతమ్మకు నచ్చచెప్పబోయేరు. "కోడలింటి కొచ్చినా ఇంకా మీ కెందుకండీ ఈ శ్రమ?— హాయిగా మీ మానాన మీరు కూర్చోండి. చచ్చినట్టు చాకిరీ చేస్తుందది!" అని.

అలా వాళ్ళన్నప్పుడల్లా సీతమ్మ చిరునవ్వు నవ్వేది. "నేనున్నంతకాలమయినా అది సుఖంగా ఉంటే చాలు!" అని సమాధానమిచ్చేది.

సీతమ్మ అలా అనడంచేత, ధైర్యంలేని మనిషనీ, పైగా లోలోన బాధపడుతున్నప్పటికీ ఇంటిగుట్టు కాపాడుకోడంకోసం పైకి అలా అంటున్నదనీ ఇరుగు పొరుగులవారు తీర్మానించేరు.

ఆవాళ సీతమ్మ నీళ్లు తెస్తూ తెస్తూ కాళ్ళలో బట్ట అడ్డపడి పడిపోవడంవల్ల; సమయం దొరికింది కదా అని లక్ష్మిని దుయ్యబడుతూ సీతమ్మకు సానుభూతిని తెలియజేసేరు. లక్ష్మిని దూషిస్తే సీతమ్మ లోలోన సంతోషిస్తుందనుకున్నారు వాళ్ళు.

అవాళ్టి విమర్శలవల్ల సీతమ్మ అంతగా బాధపడకపోయినా లక్ష్మిమాత్రం చాలా బాధపడింది. లోకులు తనమీదఎందుకంతలా కత్తికట్టి దుయ్యబడుతున్నారో అర్థమయింది కాదు లక్ష్మికి. తను ఏ పనీపాటూ చెయ్యకుండా హాయిగా బ్రతకాలనే అత్తగారు వాంఛిస్తున్నది. తన భర్తకూ అదే వాంఛిస్తున్నాడు. తనకుటుక్కికూడా అలా సుఖంగా కాలం గడిచిపోవాలనుకుంటున్నది!—ఇకపోతే తను ఏపనీపాటూ చెయ్యకుండా సుఖంగా ఉండడం, తనతో ఏవిధమయిన సంబంధంలేని లోకుల కంతకసిగా ఉండడానికి కారణం??... తను వాళ్ళకేం అపకారం చేసింది! — తన మానాన తనుంది. తనతో మాట్లాడిన వాళ్ళందరితోనూ సఖ్యతగానే మాట్లాడేది. వాళ్ళ వ్యక్తిగతవిషయాలజోలికి తనెన్నడూ పోలేదు. మరయితే తన బ్రతుకు వాళ్ళకంత విమర్శనీయాంశంగా ఉండడానికి కారణం? — ఒకరు సుఖంగా బ్రతకడం ఇంకొకరికి ఈర్ష్యాజనకంగా ఉంటుందా ఈలోకంలో!—

— ఒకవేళ తనే ఇంటెడు చాకిరీచేస్తూ అత్తగారిని సుఖపెడితే? అప్పుడీలోకులు అత్తగారిని గయ్యాళిదనీ, హృదయంలేనిమనిషనీ నిందిస్తారా?—తనని బుద్ధిమంతురాలని మెచ్చుకుంటారా? — ఆలోచన లెక్కువవడంవల్ల తలనొప్పి వచ్చిందామెకు. పోయి మంచంమీద పడుకుంది.

— ఇంతకీ లోకుల విమర్శనలకు తల ఒగ్గడం మూర్ఖత్వ మనుకుంది!— కానీ లోకుల విమర్శనలనేవే లేకపోతే ఈ లోకంలో మానవులు పద్ధతులకు కట్టుబడుంటారా?— కానీ అది క్రమపద్ధతిలో ఉండాలి—అయితే తనమీది కొచ్చిన విమర్శలు ఎంతవరకూ సక్రమమైనవని ప్రశ్నించుకుంది లక్ష్మి.

— కొంతవరకూ తనదే తప్పని తీర్మానించుకుంది! ... యౌవనంలో ఉన్న తను సోమరిపోతులా కాలంగడుపుతూ, వయస్సు మళ్ళిన అత్తగారు ఇంటెడు చాకిరీ చేస్తూ ఉంటే చూస్తూ ఊరుకొని, ఒక్కపిసరైనా ఇంటిపని చెయ్యకపోడం సబబేనా? కనీసం రోజూ కాఫీలయినా పెట్టినపాపానపోయిందా తను? ఒకటి రెండుమారులు కావలాని కొచ్చేక పెట్టింది కాబోలు. అంతే!—

కొంపకి చిచ్చుపెట్టడం అనేది తాటాకు, రెల్లుగుడిసెలు దండిగా ఉండే మనవూళ్లలో గడ్డివాములు లేని నిర్భాగ్యులు చాటున గుట్టుగా కక్షలు తీర్చుకునే సాధనం. అమెరికాలో అంతేకాదు. అక్కడ ఒక రకం కుర్రకారు ఉబలాటం, లోని ఆవేశం, ఆక్రోశం తీరక కల్పించుకునే వ్యాపృత్తిలో ఇదొకటి. ఈ కుర్రకారులో మొగపిల్లలే కాదు, ఆడపిల్లలు కూడా ఉన్నారుట. (అమెరికాలో తాటాకులసంగతి తెలియదుగానిక్రాకలపా కొంపల్లో అధికంట) ప్రత్యేకం పని గట్టుకుని శాస్త్రజ్ఞులు కొందరు ఇందు విషయమై పరిశోధన జరిపేటంత ముప్పుగా పరిణమించింది ఈ సమస్య. పరిశోధన చెయ్యగా తేలిందేమిటంటే కొందరు యువకుల్ని పరిశీలిస్తే తేలిన అంశాలేమిటంటే:—కొంపకి నిప్పంటిస్తే ఎలాటి ప్రమాదం సంభవిస్తుందో, ఎంత నష్టం కలుగుతుందో ఈ యువకులికి తెలియకపోదు. అయినా ఆపని చేసేస్తేగాని ఉండబట్టలేరు; ఒళ్లంతా చిటపట లాడుతుంది. ఒక్కొక్కప్పుడు ఎవ్వరూ వినడానికి వీల్లేనిచోటు చూసుకుని గట్టిగా గొంతు తీపు తీరేలాగ అరిచేస్తారు. కొందరు గంటల తరబడి ఏడుస్తారు. ఆ నిప్పు కొస్తా పెట్టేస్తే, ఈ బాధంతా తీరిపోతుంది. జాజ్వల్యమానంగా కొంప తగలడిపోతుంటే చూసి సంతోషావేశాలు పట్టలేక కేరింతాలు కొడతారు. కొందరు ఇళ్లల్లోవాళ్ళని ఇళ్ల లోనే తాళంపెట్టి నిప్పంటించి ఆపైన విన వచ్చే భీకర రోదనాలూ, ఆర్తనాదాలూ వింటూ ఆనందబాష్పాలు విడుస్తారటకూడా.

ఈ సంగతులాలోచిస్తావుంటే, విద్యార్థిదశ జ్ఞప్తికి వస్తుంది. ఏ కొద్దిమందోగ్నే తప్ప అల్లరిపడని టీచర్లు అంటూ ఉండరు. అత్యంత సౌమ్యుడూ ఉత్తముడూ అనో, లేక అరివీరభయంకరుడనో పేరు తెచ్చుకునే టీచర్లని చూస్తే విద్యార్థులికి అంత ఉత్సాహం ఉండదు. పాఠ్యవిషయంలో ఆసక్తి కలిగించే టీచర్లుకూడా కొందరు పాఠశాలావరణకు అవతల విద్యార్థులకు దూరంగా ఉంటే అల్లరిపడరు.

ఇంక మిగతా టీచర్లని క్లాసులోఅయ్యేది, వీధిలో అయ్యేది, చూస్తేచాలు విద్యార్థులికి హుషారెక్కువైపోతుంది. ఒక్కొక్కప్పుడు బల్లలు బద్దలౌతాయి, చెవులు చిల్లులు పడతాయి; పుస్తకాలు తుంపులై గాలికెగరడంకూడా కద్దు.

ఇలా బల్లలు బద్దలుకొవడం కూతలు మొరుగులు వగైరాలతో చెవులు చిల్లులు పడ్డం మొదలైన లక్షణాల్ని ఏ శాస్త్రజ్ఞులైనా పరిశీలించినట్లయితే, తరహా మొదటి రకమేననీ, అయితే అమెరికన్లకంటె మనవాళ్ళు ఇంకా సౌమ్యులనీ, ఉత్తములనీ, నాగరికులనీ బోధపడుతుంది. పాఠశాలల్లో నేర్చుకోవలసిన, లేక చదవవలసిన విషయాలు మమత, ఆసక్తి కలిగించేవిగా మారే శుభదినం వచ్చినప్పుడు, కాలుచేతులూ గొంతికల విశేష పరిశ్రమకూడా మరొక మంచి తెన్నులోపడి 'చదువుల కొట్టాలు' విజ్ఞాన నిలయాలౌతాయి. ఎస్. ఆర్.

# ★ లోకంతీరు ★

ఆఖరికి భర్తస్నానంచేసేఅందుకు నీళ్లయినా తోల్లిస్తున్నదా రోజూ? — లేదే మరి తప్పెవరిది?

కానీ తన అత్తగారు తను కాలు కదిపే అందుకైనా ఒప్పుకోకుండాఉందాయె!— బాధతో కాక హృదయపూర్వకంగానే ఇంటెడి చాకిరీ చేస్తున్నది. తన భర్తకూడా అంతే!—తల్లి ఏం చెపితే అదే!—ఇంటి సంబంధమైన చాకిరీ చెయ్యమని తన నెన్నడూ శాసించలేదు. అధికవాత్సల్యం కూడా ప్రమాదకరమే అనుకుంది లక్ష్మి!— ఇంతకీ తప్పెవరిదనే ఆలోచనలో పడింది లక్ష్మి.

బాగా ఆలోచించి, ఇక అత్తగారిచేత బలవంతాన్నయినా పని మానిపించేసి తనే ఇంటెడు చాకిరీచేసే అందుకు తీర్మానించుకుంది లక్ష్మి.

ఎన్నిరకాలగానో నచ్చచెప్పింది శీతమ్మ. కానీ వింటేనా?—"ఏమయినాసరే, మీరిక నుంచీ పని చెయ్యడానికి వీల్లేదు." అంది లక్ష్మి.

"చూడులక్ష్మీ!—లోకులు రకరకాలుగా అనుకుంటారు. వాటన్నింటినీ మనం లెక్కించకూడదు"

"అత్తగారూ!—మీ రింత అమాయకులేం?—మీరు మంచివారే!—కానీ మీరింత మంచివాళ్లవడంవల్ల లోకులు నాహృదయం తూట్లు పడేలా విమర్శిస్తున్నారు. ఏమైనా సరే నా గుణింపయినా మీరు కొంచెం మార్పుకావాలి. ఇక మీరు ఒక్క పనయినా ముట్టుగుంటే నన్నుచంపుకుతిన్నట్టే!"అంది లక్ష్మి.

మాట్లాడలేకపోయింది సీతమ్మ. ఆమె గొంతుక బొంగురుపోయింది. సక్రమంగా సాగిపోతున్న తమ కుటుంబంలో లోకులెందుకు చిచ్చు బెట్టేరో అర్థం కాలేదామెకు.

మొదట్లో ఒకటి రెండు రోజులు శీతమ్మ పనిచెయ్యబోయేసరికి, లక్ష్మి అలిగి తిండి తినడంమానేసింది. "ఇంత మూర్ఖత్వంకూడదు లక్ష్మీ", అంది సీతమ్మ.

— కానీ లక్ష్మిలో మూర్ఖత్వం కరడు గట్టుకు పోయింది. ఇక గత్యంతరం లేక సీతమ్మ విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది.

అర్థంలేని సంతృప్తి కలిగింది లక్ష్మికి!—

ఎప్పుడూ తెగపనిచేసే చేతులకీ కాళ్ళకీ ఒక్కమారు అనవసరంగా విశ్రాంతి లభించడంవల్ల, అవి మరెప్పుడూపనిచేసేఅందుకు వీలులేని స్థితిలోకి వచ్చాయి సీతమ్మకు. మానసికవ్యాధి శారీరకవ్యాధిగా మార్చింది.

—అంత వేగిరంలోనే అత్తగారు ఆపరిస్థితిలోకి రావడానికి కారణం లక్ష్మికి తెలుసు! కన్నీటి ప్రవంతికి ఆనకట్ట ఎలా కట్టాలో చేతనయిందికాదామెకు.

లోకులు అనుకుంటున్నారు. "మెల్లిగా మంచంమీద కెక్కించేసిం దత్తగారిని!— అంతవరకూ కృషి చేసిం దావిడగారు" అని.

ఆమెహృదయంలో అగుపడనిగాయాలు! —"ఈ లోకంతీరు ఇంతే కాబోలు!"అనుకుంది లక్ష్మి.

సతతం కన్నీరుకారుస్తూఉండే కోడలిని ఎన్నాళ్ళు చూడగల దా మహాసాధ్వి సీతమ్మ?!— ★



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu ChettySt, Madras



పంచతంత్రం

# మిత్రలాభం



కర్త.. విశ్వప్పుల నరసింహమూర్తి


































